# గురజాడ రచనలు

## కవితల సంపుటం

సంపాదకుడు :
సెట్టి ఈశ్వరరావు



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001

**GURAJAADA RACHANALU KAVITHALA SAMPUTAM**

*– Setti Eswara Rao*

| | | |
|---|---|---|
| ప్రచురణ నెం. | : | 2350/1916 R |
| ప్రతులు | : | 1000 |
| పేజీలు | : | 54+174=228 |
| ప్రథమ ముద్రణ | : | డిసెంబరు, 1984 |
| ద్వితీయ ముద్రణ | : | డిసెంబరు, 1986 |
| తృతీయ ముద్రణ | : | మార్చి, 1989 |
| చతుర్థ ముద్రణ | : | మే, 1991 |
| పంచమ ముద్రణ | : | అక్టోబరు, 1995 |
| షష్ఠీ ముద్రణ | : | ఏప్రిల్, 2005 |



ముఖచిత్రం : అంట్యాకుల పైడిరాజు

టైటిల్ డిజైన్ : చంద్ర

**వెల : రూ॥ 65-00**

ప్రతులకు : **విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,**
విజ్ఞాన భవన్, అబిడ్స్, హైదరాబాద్ - 500 001.
E-mail: visalaandhraph@yahoo.com
**విశాలాంధ్ర బుక్ హౌస్,**
(అబిడ్స్, సుల్తాన్‌బజార్) హైదరాబాద్,
విజయవాడ, గుంటూరు, అనంతపురం,
తిరుపతి, విశాఖపట్నం, హన్మకొండ, కాకినాడ.



ముద్రణ : **శ్రీ కళాంజలి గ్రాఫిక్స్**, హైదరాబాదు.

# ఆధునిక భాషా సాహిత్యాల యుగకర్త

# గురజాడ అప్పారావు

తెలుగు భాషా సాహిత్యాలలో పెద్ద మార్పులు రెండుసార్లు వచ్చాయి రమారమి వెయ్యేళ్ళ క్రితం నన్నయ్య (11 వ శతాబ్దం), ఆయనకు ముందర వుండిన కవులు తెచ్చిన మార్పు మొదటిది.

మన కాలానికి దగ్గర, సుమారు నూరేళ్ళక్రితం వచ్చిన మార్పు రెండోది. అది గురజాడ అప్పారావు (1862 - 1915) ద్వారా వచ్చింది.

ఈ రెండు మార్పులకు వెనుక వున్నవి, రెండు విధాలైన చారిత్రక పరిస్థితులు.

నన్నయ కాలంలో తెలుగు భాషా వికాసానికి అనువైన సామాజిక పునాదిగా వున్నది, ఏలుబడి చేస్తూ వుండిన ఫ్యూడల్ (భూస్వామ్య) వర్గం. ఆ వర్గం వారి అవసరాలు, నమ్మకాలు, అభిరుచులు, అప్పటి నాగరికత అంతట్లో ప్రతిఫలించినట్టుగనే భాషా సాహిత్యాలలోనూ ప్రతిఫలించాయి. అందుకు తగ్గట్టుగా, "రాజకులైక భూషణు" డైన రాజరాజ నరేంద్రుడు తన "కుల బ్రహ్మణు ననురక్తు నవిరళ జప హోమ తత్పరు" డైన నన్నయ్యను మహాభారతాన్ని "తెనుగున రచియింపు" మని కోరడమూ, ఆయన రాయడమూ జరిగింది. రాజరాజ నరేంద్రుని "హృదయంబున ననవరతంబును శ్రీ మహా భారతంబునందలి యభిప్రాయంబు విన నభిలాష పెద్దయై" వున్నదట.[1]

ఫ్యూడల్ వర్గం, ఆ వర్గం భావాలు గురజాడ అప్పారావు కాలం వరకూ పాతుకపోయి వుండడంవల్ల, ఎనిమిది శతాబ్దాలు గడిచే వరకూ సాహిత్యంలో పెద్ద మార్పులేవీ రాలేదు (పురాణ రచన దశనుండి ప్రబంధ రచన వంటి చిన్న మార్పులు తప్ప). కఠిన శైలిలో కాకుండా కొంతగా సులభ శైలిలో వున్న రంగనాథ రామాయణం (13 వ శతాబ్దం) బసవ పురాణం (12 వ శతాబ్దం), పల్నాటి వీర చరిత్ర (14 వ శతాబ్దం) వంటి కొత్త పోకడలు అప్పుడప్పుడు రాకపోలేదు. అవి పెద్ద మార్పులుగా చెప్పవలసినవి కావు, అవైనా సాహిత్యంలో నిలదొక్కుకోవడం జరగలేదు.

---

1. ఆదిపర్వం, అవతారిక.

ఆయన కాలానికి కాస్త ముందరనుంచీ ఇంగ్లీషు వారి పాలన మూలంగా ఫ్యూడలిజం క్షీణిస్తూ వుండడమూ, పెట్టుబడిదారీ సంబంధాలూ నానాటికీ గట్టి పడడమూ, మునుపెన్నడూ లేని ఆధునిక విద్య వ్యాపించడమూ, హేతుబద్ధమైన శాస్త్రీయ దృష్టిని అలవర్చుకుంటూ వుండిన మధ్య తరగతి విద్యావంతులు రూపొందుతూ వుండడమూ జరిగాయి. ఈ పరిస్థితి రెండో మార్పుకు కారణం.

మొదటి మార్పువల్ల, పైఅంతస్తుల్లోని అతి కొద్దిమందికి మాత్రమే అందుబాటులోనూ, అవగాహనలోనూ వుండిన సంస్కృత భాషా సాహిత్యాల పట్టు కొంతవరకు సడలింది. ఇందుచేత, పై అంతస్తుల వారికే పరిమితమయినా, తెలుగు భాషా సాహిత్యాలకు నామరూపాలు వచ్చాయి. ప్రజాసామాన్యానికి వాడుక భాష కాని సంస్కృతం స్థానంలో తెలుగు కొద్దిగా చోటు చేసుకుంది.

రెండో పెద్ద మార్పువల్ల, అధిక భాగం ప్రజల వాడుకలో లేని ప్రాచీన తెలుగు కఠిన భాషా సాహిత్యాల హోరు తగ్గిపోవడమూ, అంతమందీ వాడుక చేసే తెలుగు వ్యావహారిక భాష కావ్య భాష అవడమూ జరిగాయి.

మొదటి మార్పు, తెలుగుకు కావ్య భాషార్హత తెచ్చిందన్న సంతోషమే కాని, ఆ కావ్యాలన్నీ సంస్కృత కావ్యాల పోలికవే, వాటి మారుమోతలే. అవే "అసంభావ్యములు"; "మేఘ సంచారములు;[1]" అవే "అందమైన అబద్ధాలు"[2]; అడ్డూ అపూ లేని శృంగార వర్ణనలూ, పాషాణ పాకాలూ.

మెరుగైన జైన, బౌద్ధమతాల స్థానంలో వర్ణ వ్యవస్థ, కర్మ సిద్ధాంతం మొదలైన విశ్వాసాల ప్రాతిపదికతో, శిథిలమవుతూ వుండిన తన మత పునరుద్ధరణ, ప్రాబల్యం నన్నయ్య "మహాభారత సంహితా రచన బంధురు" డవడానికి మూల కారణం. కాని తెలుగును కావ్య భాషగా రూపొందించడం ఒక మహోపకారం. గురజాడ తెచ్చిన రెండో పెద్ద మార్పు ప్రగతి విరుద్ధమైన పోకడ వున్నది కాదు.

సామాన్య మానవులకు అయోమయంగా వుండే కఠినశైలిమాట అటుంచి, నిరాధారాలను నిజమని నమ్మడం, నమ్మించడం, ప్రాచీన కావ్య కర్తలకు పరిపాటి. పెద్దన్న (16 శతాబ్దం) తన కథకోసం వర్ణించిన హిమాలయాలు ఆయన ఊహాలోకం లోనివి. సూర్యోదయమంటే సూర్యుడు ఏడు గుర్రాల రథం మీద రావడం, సూర్యాస్తమయమంటే పడమటికొండ చాటుకు వెళ్ళిపోడమనీ; భూమి బల్లపరుపుగా వుండడంవల్ల హిరణ్యాక్షుడు దానిని చాపనుచుట్టినట్టు చుట్టేశాడనీ; ఆ భూమిని మోసేది ఎనిమిది ఏనుగులనీ ప్రాచీన కావ్యాలు మనకు పసితనం నుంచీ తలలో నూరిపోస్తాయి.

---

1. కట్టమంచి రామలింగారెడ్డి, (1880-1981). "కవిత్వ తత్త్వవిచారము"
2. శ్రీ శ్రీ (1910 - 1983), విదేశాంధ్ర ప్రచురణం (లండన్) "మహాప్రస్థానం" పీఠిక.

శృంగార వర్ణనకు పూనుకున్నప్పుడు, ప్రాచీన కవులు కట్టుతప్పి విజృంభించకుండా నిగ్రహించుకోలేరు. చెప్పేది తల్లి వరసతో వున్న దేవుళ్ళ భార్యలైనా సరే, ముదురుపాకం తప్పదు. భక్తి పారవశ్యానికి పేరుపడిన మహాభాగవతం (14 వ శతాబ్దం) వంటి పురాణంలో సైతం యిది తప్పలేదు. ఉదహరించడానికి సాధ్యం కానివీ, చాలా పచ్చివీ ప్రాచీన సాహిత్యంలో కొల్లలుగా వున్నాయి.

వాస్తవికత, ప్రజారహితం, సత్ప్రయోజనం, పరిశుద్ధమైన అభిరుచి దృష్టితో చూస్తే, మొదటి మార్పు కంటె రెండో మార్పు గొప్పది. కొరతగ్గది. ప్రాచీన సాహిత్యం కొన్ని విషయాల్లో ఎంతగా మెచ్చుకోవలసినదయినా, అది నిజా నిజాల్ని, వాస్తవ జీవితాన్ని పట్టించుకోని కేవల కల్పన, నేల విడిచిన సాము. అందువల్ల అది జీవితానికి, జీవితానుభవాలకు చెందినదీ, పొందనిదీ అయిపోయింది. మనో వికాసానికి అడ్డంకి అయిపోయింది. రెండో మార్పువల్ల సుస్థాపితమైన ఆదునిక భాషా సాహిత్యాలు యిందుకు భిన్నమైనవి. యదార్థ జీవితాన్ని ప్రతిబింబిస్తూ, పురోగతికి దారి చూపుతూ, విస్తృత ప్రజానీకంతో పెనవేసుకొని వుండడం వీటి విశిష్టత.

పండిత కవులు సృష్టించి, రాజులు, ధనికులు ఆదరించిన సాహిత్యం సభా మందిరాల లోపల మారుమోగుతూ వుంటే, ఆరుబయట పేదసాదలూ, నిరక్షరాస్యులూ సృష్టి చేసుకొని పాడి, ఆది ఆనందించినది ప్రజా సాహిత్యం. ఈ రెండు రకాల సాహిత్యాలదీ దేని దారి దానిదే. ఒకటి అతిగా చదువుకున్న వారిదైతే, యింకోటి అసలు చదువే లేని వారిది, పెద్ద చదువులు లేని వారిదీ. ఈ సాహిత్యాలు ఒకటి ఊహాలోక, పరలోక మయంగా వుంటే, యింకోటి ఎక్కువ భాగం భూలోకానిది.

అగ్ర కులాల వారు తప్పితే తక్కిన వారందరూ, యావన్మంది స్త్రీలూ విద్యకు వెలి అయి వుండడం వల్ల, పై అంతస్తుల్లోని శిష్టుల సాహిత్యం శిష్టులకే పరిమితమై పోయింది. తక్కినవారు తమకు వచ్చినంతలో, తమకు నచ్చినట్టుగా కల్పించుకున్న సాహిత్యం, శిష్ట సాహిత్యానికి భిన్నమైన జానపద సాహిత్య మనబడే ప్రజా సాహిత్యం.

జీవితం దుర్భరం, దుస్సహం అయిపోయినప్పుడు (మార్గ) కవిత్వంలో, ముఖ్యంగా శతక కవిత్వంలో అసమ్మతి ధ్వనులు వినిపించేవి. "రాజుల్ మత్తులు వారి సేవ నరకప్రాయంబు...." (కాళహస్తీశ్వర శతకం, 16 వ శతాబ్దం); యిటువంటివారే పోతన్నగారి "....కర్ణాట కిరాట కీచకులు...." (మహాభాగవతం, 15 వ శతాబ్దం). జానపద సాహిత్యానికి చెందిన తత్త్వాల వంటి వాటిలో ఆనాటి పరిస్థితులకు అసమ్మతి ప్రకటనలు తరచు వినిపిస్తుంటాయి.

కాల మహిమవల్ల, జానపదులు సాహిత్యంలోనూ నిజాలు కాని నిరాధారాలు, పుక్కిటి పురాణగాథలు వుండకపోవు. కాని సామాన్యుల కష్ట సుఖాలు, వేడుకలు, వినోదాలు, శ్రమ జీవన విషయాలు ఎక్కువ. ఇటువంటివి శిష్టుల సాహిత్యంలో వెతికితేకాని దొరకవు. వారి కాలం, వారి జీవిత విధానం వారిని ఆ దారిని నడిపించాయి.

ఈ సందర్భంలో విశిష్టునిగా పేర్కొనవలసిన కవి వేమన. వడపోసిన జీవితానుభవసారాన్ని తేలిక మాటలలో, సులభ ఛందస్సులలో సూటిగా చెప్పిన సాటిలేని కవి ఆయన. వేమన నిజమైన "నానా రుచిరార్థ సూక్తినిధి" పూర్వ సాహిత్యానికి, గురజాడ సాహిత్యానికి మధ్య వారధి ఆయన. పండిత పామర జనరంజకంగా వున్న వేమన పద్యాలు యిటీవలి కాలంవరకు పండితామోదాన్ని నోచుకోలేదు.

సౌజ్ఞలు, మూగ చప్పుళ్ళ దశనుండి మనిషికి పెరుగుదల వచ్చి, తెలుగు మాట, భాష ఏర్పడి రాను రాను తెలుగు అక్షరాలు రూపొందాయి. కాని తెలుగు అక్షరాలతో, మాటలతో సాహిత్యం రాసే పరిస్థితి శతాబ్దాలు దొర్లుకు పోయినా వొకంతట వచ్చింది కాదు. సంస్కృత వ్యసనం పట్టు అంత గట్టిది. చివరికి తెలుగులో భారతం రాయడానికి పూనుకున్నాక కూడా అది "శ్రీ వాణీ గిరిజాశ్చరాయ...." అంటూ సంస్కృత శ్లోకంతో మొదలయింది.

ఆలోచన పుట్టాక, తెలుగుకు అర్హత లేదనుకొని చాలా శతాబ్దాలు తెలుగులో సాహిత్యం రాయడం జరగనే లేదు. ఎలా అయితే నేం, శాసనాల చెక్కడపు పనితో తెలుగులో మొదట గద్యం, తరువాత పద్యం రాయడం మొదలయ్యింది. తరువాత కాలక్రమాన కావ్య రచన జరిగింది గాని, ఆ కావ్యాలు అశ్రద్ధ వల్ల, అనాదరణవల్ల నశించిపోయాయి. మత వైషమ్యాలు గ్రంథ దహనానికి దారి తీశాయి.

నన్నయ్యకు ముందర తెలుగులో కావ్య రచన జరిగిందీ లేనిదీ తేలని సమస్యగా వున్నా, నన్నయ్యకు ముందర తెలుగు పద్యంలో అందచందాలతో వచ్చిందన్న విషయం, నన్నయ్యకు పూర్వపు శాసనాలలోని పద్యాన్ని బట్టి చెప్పవచ్చును. ఆది పర్వంలోని అవతారికలో వున్న పద్యంలో నన్నయ "కవీంద్రులు"గా ప్రస్తుతించిన కవుల ప్రస్తావన వుంది.[1] వీరు నన్నయ్యకు సమకాలీనులయిన తెలుగు కవులై వుండాలి.

---

1. సారమతిం గవీంద్రులు ప్రసన్న కథా కలితార్థ యుక్తిలో
నారసి మేలు నా నితరు లక్షర రమ్యత నాదరింప నా
నా రుచిరార్థ సూక్తి నిధి నన్నయభట్టు తెలుంగునన్ మహా
భారత సంహితా రచన బంధురుడయ్యె జగద్ధితంబుగాన్."

ఆదిపర్వం అవతారికలోనే నన్నయ్య మహాభారత రచనకు ముందర, రెండు భాషల్లో కావ్యాలు రచించినట్టుగా వుంటుంది. "ఉభయ భాషా కావ్య రచనా శోభితు"డైన నన్నయ్యను మహాభారతాన్ని "తెనుంగున రచియింపు" మని రాజ రాజ నరేంద్రుడు కోరాడు. అంటే భారతానికి ముందర రెండు భాషల్లో - సంస్కృతం, తెలుగు భాషల్లో - కావ్య రచన చేసి కీర్తి సంపాదించినవాడిని. అయితే ఆ కావ్యాలేవో, అవేమయ్యాయో తెలియదు.

పదకొండో శతాబ్దం వరకూ ఆంధ్రులు తమ భాషలో కావ్య రచన చేసుకోలేదంటే, నమ్మశక్యంకాకుండా వుంది. భారత రచనారంభానికి శతాబ్దాల ముందర, ఆంధ్రులు దేశ దేశాలకు సముద్రాల మీద వెళ్ళి వర్తక వ్యాపారాలు చేశారు. అమరావతి, నాగార్జున కొండ శిల్పాలవంటి పరమాద్భుత కళాఖండాలు సృష్టి చేశారు. విదేశాల నుండి విద్యార్థుల్ని ఆకర్షించిన అమరావతి విశ్వవిద్యాలయం వంటి వాటిని నిర్వహించారు. అతి ప్రాచీనమైన తమిళకావ్యం "సిలప్పదికారం"లో, వడుగునాడు నుండి, అంటే తెలుగుదేశం నుండి వర్తకులు తమిళ దేశానికి వెళ్ళిన ప్రస్తావన వుంది. కార్యకలాపాలలో, విద్యలో, కళలలో యింతగా పురోగమించిన ఆంధ్రులు, 11 వ శతాబ్దం వరకూ తమ భాషలో కావ్య రచన చేసుకోలేని అసమర్థు లవడం వింతగానే వుంది.

"నానా రుచిరార్థ సూక్తి నిధి" అయిన తాను "జగద్ధితంబు" కోసం "భారత సంహితా రచన బంధురుడ" నయ్యానని నన్నయ్య[1]; "ఆంధ్రావలి మోదం" కోసం "మహా కవిత్వ దీక్షావిధి"తో రచన సాగిస్తానని తిక్కన[2] (13 వ శతాబ్దం) చెప్పారు. అయితే నన్నయ్య దేని హితం కోసమైతే పూనుకున్నాడో ఆ జగత్తు చాలా చిన్నది. అలాగే తిక్కన ఎవరి మోదం కోసమైతే మహాకవిత్వ దీక్షా విధిని పెట్టుకున్నాడో ఆ ఆంధ్రావలీ కొంచమే. అవి శిష్టులైన అతి కొద్ది పై వర్గాలకు పరిమితం.

ఇహలోక విషయాలు కావ్య వస్తువులుగా తగవనుకొని, మన ప్రాచీన కావ్య కర్తలు వాటి జోలికి పోలేదు. ఇది అప్పటి యింకో సంకుచిత పరిధి.

ఇప్పటి తూకపు రాళ్ళతో తూచి, ప్రాచీన సాహిత్యానికి విలువ కట్టడం వల్ల కలిగే ప్రయోజనం శూన్యం. భాషా సాహిత్యాల పరిణామ దశల్లో, ఒకప్పుడుండే తీరు, యింకొకప్పుడుండే తీరుకు వేరుగా వుంటుంది. ఈ తీరు

---

1. ఇంతకు ముందర ఉదహరించిన నన్నయ్య పద్యం "సారమతిం...."
2. కావున భారతామృతము గర్ణపుటంబుల నార గ్రోలి యాం
 ధ్రావలి మోదముం బొరయునట్లుగ సాత్యవతేయ సంస్మృతి
 శ్రీ విభవాస్పదంబయిన చిత్తముతోడ మహాకవిత్వ దీ
 క్షావిధి నొంది పద్యముల గద్యములన్ రచియించెదం గృతుల్."

తెన్నులు చరిత్రలో అంతర్భాగమై పోతాయి. ఆయా కాలాల విలువలు, అవి సాధించిన నిగ్గు పిత్రార్జితాల వంటివి. ఇప్పటి అవసరాల మేరకు మాత్రం ఉపయోగించుకోవలసినవి.

ఒకప్పుడున్న ఆలోచనలు, ఆదర్శాలు, అభిరుచులు, అలవాట్లు, కాలం పోకడవల్ల, పరిస్థితుల మార్పువల్ల యింకొకప్పటికి సరిపడని సంగతులవుతాయి; ముందుకు వెళ్ళనివ్వకుండా వెనక్కు లాగుతూ వుంటాయి. ఇది భాషా సాహిత్యాలకూ వర్తించేదే. పురోగమనం స్తంభించిపోకుండా వుండాలంటే, పెద్ద మార్పు తేవలసి వుంటుంది. అందుకు పరిస్థితులు అనుకూలించవలసి ఉంటుంది.

పందొమ్మిదో శతాబ్దం చివరి దశాబ్దాలలో, యిటువంటి పెద్ద మార్పు భాషా సాహిత్యాలలో తీసుకరావలసిన అవసరం గుర్తింపబడింది. వెనకచూపును కాల పరిస్థితులకు తగినట్టు మరల్చి, ముందు చూపును అలవర్చుకోవలసిన అవసరం వచ్చింది. ఈ అవసరం ఎనిమిది, తొమ్మిది వందల సంవత్సరాల కిందట, తెలుగు భాషాసాహిత్యాలకు కలిగిన అవసరంకంటె పెద్దది. ప్రజలలో వున్న చైతన్యం ఒకప్పుడున్న చైతన్యం కంటె చాలా ఎక్కువ. ఆ అవసరం తీరడానికి పెద్ద మార్పు-తెలుగు భాషాసాహిత్యాలలో రెండో పెద్ద మార్పు-రావడానికి పరిస్థితులు అనుకూలంగా వున్నాయి. గత శతాబ్దం చివరి దశాబ్దంలో ఈ మార్పు రావడం మొదలయింది. ఈ మార్పు ఫలితం, దివి నుండి భువికి భాషా సాహిత్యాల అవతరణం. ఈ సాధనలో భగీరథుడి పాత్ర, గురజాడ అప్పారావుది. దీక్షా దక్షతలతో యీ చారిత్రక ఆవశ్యకతను సాధించి, ఆధునిక భాషా సాహిత్యాల యుగాన్ని ప్రారంభించిన ఘనత ఆయనది.

## 2

ఆధునిక భాషా సాహిత్యాల యుగారంభం, యీ యుగానికి ఆది కావ్యమైన "కన్యాశుల్కము" తొలిసారి ప్రదర్శింపబడిన 1892 ఆగస్టు నెలలో జరిగింది, ఆ రోజున వాడుక భాష ఉత్తమ కావ్య భాషయ్యింది; వాస్తవ జీవితం సహజమైన, సుందరమైన కావ్య వస్తువయింది. కాలం చెల్లిన ప్రాచీన కావ్య పద్ధతుల కది వీడ్కోలు దినం.

నన్నయ్యకు, ఆయన పూర్వులు పూర్వ రంగం సిద్ధపరచి వుంచినట్టుగానే కందుకూరి వీరేశలింగం (1848-1919) వంటివారు, గురజాడ ఆధునిక భాషా సాహిత్యాలు సుస్థాపితం చేయడానికి పూర్వరంగాన్ని ఏర్పరచి వుంచారు. ప్రాచీన కావ్య భాష పట్ల, కావ్య వస్తువుల పట్ల మోహం మొత్తి వీరేశలింగం

సులళిత గ్రాంథిక శైలికి మారడమూ, "రాజశేఖర చరిత్ర" (1878) వంటి నవలలూ, వాడుక భాషలో "బ్రహ్మ వివాహము" వంటి ప్రహసనాలు రాయడమూ, యీ పూర్వ రంగలోనివే. నీచ పాత్ర లనబడే వాటికి మాత్రం పాత్రోచిత భాషతో, చరిత్ర కొంత, అసంభవ ఘటనలు కొంత మిశ్రమం చేసిన "ప్రతాప రుద్రీయం"[1] యించు మించు కన్యాశుల్కం కాలంలోనే వచ్చింది. పూర్వ కాలంలో యక్షగానాల వంటివి, వాడుక భాషలో సాంఘిక సమకాలీన యితి వృత్తాలతో వచ్చినవి వున్నాయి కాని యివేవీ మార్గదర్శకమైన మహాకావ్య లక్షణాలున్నవి కావు.

కన్యాశుల్కం ఆధునిక తెలుగు సాహిత్యానికి ఆదికావ్యం అవడం వొక్కటే కాదు, యిప్పటికి తెలిసినంత వరకు - అది గురజాడ రాసిన మొట్ట మొదటి తెలుగు రచన కూడా. దీనికి పదేళ్ళు ముందర, అంటే తన యిరవ య్యేళ్ళ వయసులో, ఆయన ఇంగ్లీషు పద్యాలు రాసి స్థానిక పత్రికల్లో ప్రచురిస్తూ వుండేవారు. వాటిలో "సారంగధర" అన్న ఇంగ్లీషు పద్య కావ్యం' ఆ కాలపు బెంగాల్‌లోని ప్రముఖుడు "రీస్ అండ్ రయ్యత్" అన్న ఇంగ్లీషు పక్ష పత్రిక సంపాదకుడు అయిన శంభుచంద్ర ముఖర్జీ (1839-1894) విజయ నగరం పత్రిక "ఇండియన్ లీజర్ అవర్" లో చదివి మెచ్చుకొని, దానిని తన పత్రికలో మళ్ళీ ప్రచురించారు. (1883) గురజాడ పట్ల ప్రశంస, వాత్సల్యం చూపుతూ ఆయన ఉత్తరం రాసి, విజయనగరం పత్రికా సంపాదకుని ద్వారా పంపారు. తరువాత వారిద్దరి మధ్యా ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగాయి. ఈ ఇంగ్లీషు కవిత్వమే, గురజాడను విజయనగరం మహారాజు ఆనంద గజపతి (1850-1897) దృష్టిలోకి తీసుకు వెళ్ళింది. తరువాత పరిచయాలు (1887), ఆప్యాయతలూ అనుబంధాలు ఏర్పడ్డాయి.

ఆ కాలంలోనే, ఆనంద గజపతి విశాఖ మండలంలో జరుగుతూ వున్న కన్యాశుల్క వివాహాల వివరాలు సేకరించారు. ఆ వివరాలలో బయటపడ్డ అతి దారుణ విషయం, కడుపులో వున్న బిడ్డల్ని సైతం కొనడానికి (ఆ పుట్టే బిడ్డ ఆడపిల్ల అవుతుందో అవదో తెలియకపోయినా) బేరసారాలు సాగడం! ఈ సమాచార సేకరణ, కన్యాశుల్కం రాయడానికి ప్రేరణ "మన మహిళా లోకంలోని ఎంతో నిస్సహాయులైన ఒక భాగంలోని వారిని సాంఘిక అవినీతి క్రిములతో నిండిన దుర్భర దాస్యం నుండి కాపాడడానికి"[2] ఆనంద గజపతి ఆలోచిస్తూ ఉండినట్టు గురజాడ తెలిపారు. తనను పెద్దగా బాధించిన యీ దారుణ దురా చారాన్ని యితివృత్తంగా చేసి నాటకం రాయమని, ఆనంద గజపతి తన కాప్తుడైన గురజాడకు సూచించారేమో!

---

1. నాటకం కర్త వేదం వెంకటరాయ శాస్త్రి (1853-1929)
2. చూ. కన్యాశుల్కం మొదటి కూర్పు పీఠిక. ఆనంద గజపతికి అంకితం.

కన్యాశుల్కం రెండు కూర్పుల పీఠికల్లోనూ (1897, 1909) అంకిత పత్రంలోనూ వున్న గురజాడ ప్రవచనాలు, ఆధునిక భాషా సాహిత్యాలకు పవిత్రోపదేశాలు, అవి ఆయన ఉద్యమానికి పునాది రాళ్ళు.

ప్రగాఢమైన ధార్మికావేశంతో, వాటిలో ఆయన తన మూల భావాల్ని తెలియజేశారు. అవి :

- సమాజాన్ని అప్రతిష్టపాలు చేసే పరిస్థితిని కళ్ళ ముందర పెట్టి, నైతిక భావాల ఉన్నత ప్రమాణాల్ని ప్రాచుర్యానికి తేవడంకంటె, సాహిత్యానికి ఉత్తమమైన కార్యమేదీ ఉండదు.
- ఈ చెడుగును జనరంజకమైన నాటకంలో బయటపెట్టి, ప్రజాభిప్రాయాన్ని ప్రభావితం చెయ్యాలి.
- ప్రజా బాహుళ్యంలో చదవడం అలవాటయ్యేంత వరకూ, యిటువంటి ఆరోగ్యకరమైన ప్రభావాన్ని నాటక రంగం నుండి మాత్రమే ఆశించగలం.
- కావ్య భాషకంటె బాగా తెలిసేది కాబట్టి, కన్యాశుల్కం వాడుక భాషలో రాయడం జరిగింది; అది నాటకోచితమైన భాష అవడంవల్ల కూడా.
- తెలుగు కావ్య భాషను గొప్ప నాగరికతా సాధనంగా చేయాలనుకుంటే, దానిలోని అనవసరమైన, వాడుకలో లేని పదాలను తప్పకుండా తొలగించివేయాలి.
- తెలుగు కావ్య భాష, సంప్రదాయం తెలుగు వారిమీద రుద్దబడిన పెద్ద ప్రతిబంధకాలు సంకెళ్ళను పూజించే వారు, వాటిని పూజించాలనుకుంటే పూజించనివ్వండి.
- మాతృ భాషలోని సాహిత్యం రైతుల్ని తట్టి లేపుతుంది; భారతదేశంలోని యింగ్లీషు వారినీ తట్టి లేపుతుంది. దానికి ఉన్న సదవకాశాలు అపారం.
- తెలుగులో నూతన కావ్య భాషను రూపొందించేవి వాదోపవాదాలు కావు. గొప్ప రచయిత దానిని రాసి సృష్టి చేయాలి. అతని కోసం మనం రంగాన్ని సిద్ధపర్చి ఉంచుదాం.

ఇటువంటి మూల భావాలతో, సంకల్పాలతో, అపూర్వమైన ఉపజ్ఞతో రాసిన కన్యాశుల్కమూ, యితర రచనలూ గురజాడను ఆధునిక సాహిత్య యుగకర్తను చేశాయి.

* * *

ఒకప్పటి వానరుడు, ఇప్పటి నరుడుగా లక్షల సంవత్సరాల కాలంలో ఎదిగాడు. ఆకో, అలమో, దొరికిన పిట్టదీ, జంతువుదీ పచ్చి మాంసమో తిని

బతికాడు. చెట్ల బెరళ్ళు, జంతువుల చర్మాలూ కట్టుకొని కాలక్షేపం చేశాడు. కాపురం చెట్ల మీదా, గుహల్లోనూ, ఈ విధంగా, అనేక జీవరాసుల్లాగా నశించి పోకుండా మిగిలాడు. కాలం గడుస్తున్న కొద్దీ, మనిషి బుద్ధి వికసిస్తూండడం వల్లనే, సృష్టిలో ఉత్తమోత్తమ ప్రాణిగా, ఇప్పటి స్థితికి చేరుకున్నాడు.

అయితే యీ పెరుగుదల సూటిగా వచ్చిందీ కాదు. చప్పుచప్పున జరిగిందీ కాదు. మనిషి బుద్ధి వికాసం, ఆయా దశల్లోని అతని అనుభవాన్ని బట్టి అవగాహనశక్తి వచ్చిందే కాని ఇంకొకటి కాదు. అనుభవైక వేద్యం కాకుండా, హేతుచింతన లేకుండా కేవలం ఊహను అనుసరించీ, భ్రమపైని ఆధారపడీ స్థిరపర్చుకున్న నమ్మకాలు, చేసే చర్యలు మంచి ఫలితాలు ఇవ్వవు. పైగా బుద్ధి మాంద్యం, జడత్వం కలిగిస్తాయి. "అనుభవమ్ముల తత్వమెరుగక శుకములగుదురు."[1] అని గురజాడ చెప్పడం ఇందువల్లనే. తన అనేక పరిణామ దశల్లో, మనిషి అటంకా లెన్నిట్నో దాటుకుంటూ పెరుగుతూ వచ్చాడు. ఆటంకాలు దాటకుండా ఉండిపోయినప్పుడు మరుగుజ్జయి పోయాడు; మంద బుద్ధయిపోయాడు.

నాలుగైదు శతాబ్దాల కాలంలో, ఈ రెండు తరహాల పరిస్థితులు- పెరిగే పరిస్థితి, పెరగక స్తంభించిపోయివున్న పరిస్థితి-ప్రాచ్య దేశాల్లోనూ, పాశ్చాత్య దేశాల్లోనూ కనిపిస్తాయి. అభివృద్ధి విషయంలో పాశ్చాత్యదేశాలు (గ్రీకు, రోము దేశాలు తప్పితే). ప్రాచ్య ఖండంలోని భారత, ఈజిప్టు, చైనా దేశాలు ఒకప్పుడు వెనుకబడి వుండేవి. మార్టిన్ లూథర్[2] క్రైస్తవ మత సంస్కరణ ఉద్యమం, రినైజాన్స్[3], పారిశ్రామిక విప్లవం[4], ఫ్రెంచి విప్లవం[5] వంటివి, పాశ్చాత్య దేశాల్లో బుద్ధి వికాసానికీ, భౌతిక సంపదల అభివృద్ధికీ దారి చూపాయి. అందువల్ల,

---

1. "లవణరాజు కల."
2. మార్టిన్ లూథర్ (1483 - 1546) మతాధికారుల నిరంకుశాధికారాన్ని ధిక్కరించారు. జర్మన్ భాషలోకి ఆయన చేసిన బైబిల్ అనువాదం, ఆ భాష అభివృద్ధికి తోడ్పడింది. ఆయన ఉద్యమం యూరప్‌లో ఆత్మిక జీవితాన్ని ప్రభావితం చేసింది.
3. ఇటలీలో మొదలైన రినైజాన్స్ (15 - 17 శతాబ్దాలు) ప్రభావం వల్ల, (భూస్వామ్య వ్యవస్థ తిరోగమనం, బూర్జువా వ్యవస్థ స్థాపన జరిగాయి. మానవీయ సంస్కృతి యూరప్ అంతటా వ్యాపించింది.
4. 18 వ శతాబ్దం చివర ఇంగ్లండులో జరిగిన పారిశ్రామిక విప్లవం వల్ల, ఉత్పత్తి యాంత్రీకరణ జరిగింది. ప్రపంచ విపణిలో సరకుల అమ్మకానికి ప్రేరణ కలిగింది.
5. ఫ్రెంచి విప్లవం(1789-1794)తో స్వాతంత్ర్యం,సమానత్వం, సోదరత్వం అన్న నినాదాలు ప్రపంచమంతటా ప్రతిధ్వనించాయి.

ఆ దేశాలు చాలా ముందుకు పోయాయి. అటువంటివి జరగని ప్రాచ్య దేశాలు వెనుకబడి పోయాయి.

పాశ్చాత్య దేశాలలో భౌతిక సంపదల అభివృద్ధి పర్యవసానంగా, అవి వెనుకబడిపోయివున్న ఇతర ఖండాలకు వ్యాపారానికి వెళ్ళి వాటిని కొల్ల గొట్టాయి. తరువాత కొత్త అవతారంలో సామ్రాజ్యాలు స్థాపించుకున్నాయి. దీనికి బలి అయిన దేశాల్లో భారతదేశం ఒకటి.

పారిశ్రామిక విప్లవం వల్ల పారిశ్రామికాభివృద్ధి ఆర్థికాభివృద్ధి జరిగిన ఇంగ్లండ్, భారతదేశంలో వర్తకం పేరుతో ప్రవేశించి, దేశ సంపదల్ని కొల్లగొట్టడం సాగించింది. వర్తక లాభాల వేట స్థాయిని పెంచేందుకు రవాణా సాధనాల ఏర్పాట్లు, యంత్ర పరిశ్రమల నిర్మాణం చేసుకొంది. ఇంకో పక్క తన రాజ్యాంగ యంత్రం స్థాపించుకొంది.

కట్టుదిట్టంగా తన రాజ్యాంగ యంత్రాన్ని నడిపించేందుకు, ఆసరాగా దేశీయుల్ని అందుకోసం తరిఫీదు చెయ్యడం యింగ్లీషు పాలకులకు అవసర మయ్యింది. ఆ విధంగా యింగ్లీషు విద్యా వ్యాపించింది. ఆ విద్య ద్వారా, ప్రయోజనకరం కాని ప్రాచీన విద్యాబుద్ధులకు అంతవరకు పరిమితమైపోయిన భారతీయ మేధకు, ప్రయోజనకరమైన ఆధునిక విద్యా లాభం కలిగింది. దీనినే గురజాడ "విద్యల నెరయ నించిన యాంగిలేయు" లని ప్రశంసిం చారు.[1] ఈ విద్యా లాభం ప్రశంసే "కన్ను కానని వస్తుతత్త్వము కాంచ నేర్పరు లింగిరీజులు; కల్ల నొల్లరు; వారి విద్యల కరచి సత్యము నరసితిన్" అన్న "ముత్యాల సరములు" లోని పంక్తుల్లో కనిపిస్తుంది....

దేశం క్రమంగా ఆంగ్లేయాక్రాంతమై, క్రిష్టియను మత ప్రచారము, ఆంగ్ల విద్యాభ్యాసము ప్రబలినవి. వీనికి తోడు భౌతిక దర్శనముల ప్రభావం వల్ల విద్యావంతులు ప్రత్యక్ష ప్రమాణబద్ధులు కాదొడిగిరి. భారతీయ ధర్మము, సంప్రదాయాలు, ఆచారాలు పునర్విచారణకు పాత్రములై, స్వస్థాన వేష భాషాభి మానం సడలుటతో, సంఘ సంస్కారోద్యమాలు సాగినవి." (తెలుగు కావ్య మాల"లో కాటూరి వెంకటేశ్వరరావు "నివేదనం").

ఆధునిక విద్యా ఫలితమైన యీ సత్య దర్శనం, నూతన భావ సంచల నానికి కారణమయ్యింది. ఆర్థికంగా జరిగిన దోపిడి ఇంగ్లీషు పాలనవల్ల దాపు రించిన దుష్ఫలితమైతే, ఆధునిక భావ సంచలనం దాని సంపర్కం వల్ల లాభించిన సత్ఫలితం.

ఈ సత్ఫలితాలకు ప్రతీకలు బెంగాల్‌లో రాజా రామమోహన్ రాయ్ (1772-1833), ఆంధ్రదేశంలో కందుకూరి వీరేశలింగం (1848-1919),

---

1. చూ. 1912 లో ఐదో జారి చక్రవర్తి ఢిల్లీ దర్బారు సందర్భంగా రాసిన గీతాలు.

గురజాడ అప్పారావు (1862 - 1915) వంటి వారు. ఈ నూతన భావాల ప్రభావం ఎంత ప్రబలంగా దేశంలో వ్యాపించిందో, యీ భావాలను మొట్ట మొదట దేశంలో వ్యాపింపజేసిన రామమోహన్‌రాయ్ పేరుతో లెక్కలేనంత మందికి నామకరణం జరగడాన్నిబట్టి గ్రహించవచ్చును.

సంప్రదాయ విద్యలు, అవి నేర్పే బుద్ధులు తెరమరుగవుతూ వున్న కాలంలో గురజాడ బాల్య, కౌమార దశలు గడిచాయి. ఇంగ్లీషువారి పరిపాలన తాకిడికి, ఇంగ్లీషు విద్యా ప్రభావానికీ, పాత సామాజిక వ్యవస్థ పునాదులు కదిలి పోతోన్న కాలం అది. లెక్కలేనన్ని చిన్న చిన్న రాజ్యాలుగా వున్న దేశంలో ఏకీకృతమైన పరిపాలన స్థాపన అయ్యింది. తమ దోపిడీకి అనుగుణమైన మార్పులను ఇంగ్లీషువారు తెచ్చివుండడంవల్ల దేశంలో పెట్టుబడిదారీ సంబంధాలు దిట్ట పడుతూ వచ్చాయి. పరిపాలనా యంత్రం చక్రాన్ని తిప్పేందుకు సిబ్బందికోసం ఇంగ్లీషు విద్యా బోధన దేశమంతటా వ్యాపిస్తూ వచ్చింది. నిర్దాక్షిణ్యంగా అణచి వెయ్యబడిన సిపాయిల తిరుగుబాటు (1857-1858) తరువాత, పరాయి పరోక్ష పాలన ప్రత్యక్షపాలనగా స్థిరపడింది. ఈస్టిండియా కంపెనీ పక్కకు తప్పుకోగా, ఇంగ్లీషురాణి ప్రభుత్వం తెరవెనుక నుంచి రంగం మీదికి వచ్చింది. దేశంలో వస్తోన్న యిటువంటి మార్పులు, భావ సంచలనకే కాక, భావ సంఘర్షణకూ, రాజకీయాందోళనకు సైతం కారణమయ్యాయి. వీటివల్ల కీడు తెచ్చిపెట్టే పరిస్థితి దాపురించకుండా, ఇంగ్లీషుప్రభుత్వం ప్రోద్బలంతో, 1885లో ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ స్థాపన జరిగింది. విద్యా వ్యాప్తి విషయంలోనూ, సాంఘికంగా అభ్యు దయకరమైన చర్యల విషయంలోనూ, ఇంగ్లీషు పాలనవల్ల దేశానికి మేలు కలుగుతూ వుండడంచేత, వీరేశలింగం, గురజాడ అప్పారావువంటి మేధావులు అది "జ్ఞానమును, స్వాతంత్ర్యమిచ్చే," "సజనుల వాంఛలెల్లను తీర్చే" "ధర్మ రాజ్యం"గా దానిపట్ల భ్రమలకు లోనయ్యారు.[1] గురజాడ పుట్టుకకు ముందుగా, బాల్య, విద్యార్థి దశల్లోనూ దేశంలో వీస్తోన్న గాలులు యిటువంటివి.

ఈ పరిణామాలవల్ల దేశంలో ఏర్పడిన పరిస్థితుల ప్రతిబింబాల్ని, ఆ పరిస్థితులు సంఘర్షించవలసివచ్చిన అంతకు ముందరి స్థితిగతుల్ని, మేఘ సంచారం చెయ్యకుండా వాస్తవంగా, కళాత్మకంగా చిత్రించిన ఉత్తమ సాహిత్య సృష్టి కన్యాశుల్కం. గురజాడ యితర సాహిత్య శాఖల్లో చేసిన రచనలూ యిటువంటివే.

కన్యాశుల్కంలో కనిపించే ఆనాటి దేశ భౌతిక, మానసిక పరిస్థితు లెలా వుండేవంటే - విజయనగరానికి చేరువగా వున్న గ్రామం నుంచి అగ్నిహోత్రా వధాన్లు కోర్టు పని మీద, గిరీశం కాకినాడకు ఓడెక్కి వెళతాననడం, అప్పటి

1. "ధించు లంగరు."

రవాణా పరిస్థితిని తెలుపుతుంది. అంటే, గిరీశం దగ్గరి ఓడరేవు భీమునిపట్నం నుండి కాకినాడకు ఓడ ప్రయాణం చేయవలసి వుంటుంది. ఒక మూఢనమ్మకాల ముచ్చట: మొగ పెళ్ళికూతురు అబద్ధపు ఆత్మహత్య వల్ల దయ్యమైపోవడం, ఆ దయ్యాన్ని సీసాలో బంధించి బిరడా బిగించడమూ. అప్పటి యిటువంటి స్థితిగతుల్నీ మనుషుల మనసుల్నీ వివరంగా వీరేశలింగం "రాజశేఖర చరిత్ర", "స్వీయ చరిత్ర" వంటి గ్రంథాలు, అంతకుముందరి ఏనుగుల వీరా స్వామయ్య (జననం 1780 ప్రాంతం, మరణం 1836) "కాశీ యాత్ర చరిత్ర" తెలుపుతాయి. కన్యాశుల్కం లాగానే యివి ఆ కాలపు సాంఘిక చరిత్రలు.

కన్యాశుల్కం రాయడానికి పదేళ్ళ ముందర, ఇంగ్లీషు కవిగా సాహిత్య రంగంలో ప్రవేశించిన యిరవయ్యేళ్ళ ఎఫ్. ఎ. విద్యార్థి గురజాడ అప్పారావు మనస్సు ఎటువైపు మొగ్గుతూవున్నదీ, ఆయన ఇంగ్లీషు పద్య కావ్యం. "సారంగధర"ను చదివి, మెచ్చుకొని, తన పత్రికలో పునర్ముద్రించిన శంభుచంద్ర ముఖర్జీ 1884 జనవరి 27న ఆయనకురాసిన ఉత్తరాన్నిబట్టి గ్రహించవచ్చును. "దేశ శ్రేయస్సు కోసమూ, ప్రపంచ శ్రేయస్సు కోసమూ పాటుపడడానికి బలమైన యిచ్ఛా బాధ్యతలున్నవారు, అమితమైన కష్టాలు పడడానికి సిద్ధపడాలి" అనీ; అదే సంవత్సరం జూన్ 22న రాసిన ఉత్తరంలో "మీరు రాద్దామనుకున్న రాజకీయ పద్య కావ్యాన్ని ప్రారంభించారా?" అని ముఖర్జీ గురజాడకు రాశారు; వివిధ ఛందస్సుల్లో పద్యాలు, జానపద గేయాలు రాయడానికి ప్రయత్నించమని సలహా యిచ్చారు.[1] ఈ సలహాలో, తెలుగులో కవిత్వం రాయమని ప్రోద్బలం వున్నట్టుగా వుంది. ముఖర్జీ ప్రస్తావించిన రాజకీయ పద్య కావ్యం గురజాడ అప్పుడు రాసినట్టుగా లేదు. కాని తరువాత చాలా కాలానికి, తాను వెళ్ళిన 1908 మద్రాసు కాంగ్రెస్ మహాసభగురించి ఇంగ్లీషులో వ్యంగ్య గీతాలు రాశారు. గురజాడ తమ్ముడు శ్యామలరావు ప్రారంభ కాలంలోని కాంగ్రెస్ పెద్దల గురించి "టు ది మాగ్నిపిసియెంట్ సెడిషనిస్ట్స్" అన్న శీర్షికతో ఇంగ్లీషు పద్యాలు. రాసినట్టూ, అవి "ది హిందూ" పత్రికలో ప్రచురణ అయినట్టూ తెలుస్తోంది.

తెలుగు సాహిత్య రంగంలో ప్రవేశించడానికి ముందర, గురజాడ ఆలోచనల్నే కాదు. సంకల్పాన్ని కూడా పైవిషయాలు తెలుపుతాయి. కన్యాశుల్కం పీఠికల్లో ఆయన వ్యక్తం చేసిన భావాలు (యింతకు ముందర వివరించినవి), గురజాడ రచనా వ్యాసంగంలో, జీవితంలో స్థిరమైన రూపంలో కనిపిస్తాయి.

"సాంఘిక అవినీతి క్రిములతో నిండిన దుర్భర దాస్యం నుండి" మహిళలను కాపాడడానికి, "సమాజాన్ని అప్రతిష్టపాలు చేసే పరిస్థితిని కళ్ళ ఎదుట పెట్టి, నైతిక భావాల ఉన్నత ప్రమాణాన్ని ప్రాచుర్యానికి తేవడంకంటె,

1. "An Indian Journalist" by F. H. Skrine, I.C.S.

సాహిత్యానికి ఉత్తమమైన కార్యమేదీ వుండ" దన్న గురజాడ ఉద్ఘోష, రానూ రానూ పరిపక్వమవుతూ, ఆయన యితర రచనలలోనూ ప్రతిచోటా వినిపిస్తుంది. సంఘంతో సాహిత్యానికుండవలసిన సన్నిహితానుబంధాన్ని, సాహిత్య ప్రయోజనాన్ని నొక్కి చెప్పే ఉద్ఘోష యిది. సమాజ శ్రేయస్సుకు పాటుపడటం ఆయన "దీక్షావిధి." దాని నాయన ఉత్తమ సుందర సాహిత్య రూపంలో ప్రత్యక్షం చేశారు.

కాటికి కాళ్ళు చాచుకొని వున్న ముసలి పెళ్ళికొడుకులకు పసి పిల్లల్ని డబ్బు కక్కుర్తివల్ల అమ్ముకోవడం (వీరేశలింగం మాటల్లో అది "నరమాంస విక్రయం"), గురజాడ దృష్టిలో సమాజాన్ని అప్రతిష్టపాలు చేసే పరిస్థితి ("పూర్ణమ్మ", కథా యిదే) అయితే; "మలినచిత్తులకు" అగ్ర కులాలు, "మలిన వృత్తులకు" నీచ కులాలు విధించిన "వర్ణ ధర్మం అధర్మ ధర్మం" ("లవణ రాజు కల"), అంచేత "మంచి అన్నది మాల అయితే మాలనే అగుదున్" అని ధిక్కారం. స్త్రీల ఆత్మరక్షణ కోసం ప్రతిఘటన ప్రతిపాదన ("కన్యక", "సౌదామిని" అన్న అసంపూర్ణ నవల ప్రణాళిక), "మనిషి చేసిన రాయి రప్పకు మహిమ కలదని సాగి మొక్కుతు మనుషులుంచే రాయి రప్పల కంటె కనిష్టం"గా చూసే వారి పట్ల నిరసన ("మనిషి"), మత మౌఢ్యాల ఖండన "దేవుడు చేసిన మనుషుల్లారా, మనుషులు చేసిన దేవుళ్ళారా మీ పేరేమిటి?"), వేశ్యా వ్యామోహం గురించి ఎగతాళి ("దిద్దుబాటు"), "సంస్కర్త హృదయం"), వేశ్యా వివాహాల ప్రతిపాదన (మధురవాణి, "సంస్కర్త హృదయం"లోని సరళ), వితంతు వివాహాలకు ప్రోత్సాహం (కన్యాశుల్కంలో బుచ్చమ్మ, "కొండుభట్టీయం"లో పార్వతి), సకల కులాల సహ పంక్తి భోజనాల సమర్థన ("ముత్యాల సరములు") స్త్రీ విద్యకు ప్రోత్సాహం ("దిద్దుబాటు"), కవిత్వం దేశంలో అభిమానాలు మొలకెత్తించేదిగా వుండాలన్న ఉద్ఘాటన ("దేశభక్తి"), సంఘసంస్కరణ, దేశ శ్రేయస్సు కోరుతున్నట్లు నటిస్తూన్న దగుల్బాజీల ఖండన (గిరీశం, "కొండుభట్టీయం"లోని కొన్నిపాత్రలు), పూర్వ సంప్రదాయాల పతనావస్థ చిత్రణ (అగ్నిహోత్రావధాన్లు, కొండుభట్టు)....

కొత్త దృక్కోణంతో "దేశమంటే మట్టి కాదోయి, దేశమంటే మనుషులోయి" అన్న కొత్త సత్యాన్ని చాటి చెప్పిన గురజాడ "దేశభక్తి" గీతం (1910), దేశాభివృద్ధి ప్రణాళిక, రవీంద్రనాథ్ టాగూర్ "ఇంటా, బయటా" అన్న నవలలో యీ భావం ప్రతిధ్వని వినిపిస్తుంది. "పాడి పంటలు పొంగి పొర్లే దారిలో పాటుపడ" మనీ, కళలెల్ల నేర్చుకు దేశి సరుకులు నించ" మనీ, అంతే కాకుండా వాటిని అన్ని దేశాల్లో వ్యాపింపజేసి ధన సంపాదన చెయ్యమనీ, "వొట్టి గొప్పలు చెప్పకో" వడం మాని "పూని యేదైనాను మేల్ కూర్చి జనులకు చూప" మనీ, "ఓర్వలేమి పిశాచిదేశం మ్రూలుగులు పీల్చే" సింది కాబట్టి,

"ఒరుల మేలుకు సంతసించ" మనీ, "సొంత లాభం కొంత మానుకు పొరుగు వాడికి తోడుపడ" మనీ, "అన్న దమ్ములవలెను జాతులు మతము లన్నియు మెలగవలె" ననీ ప్రబోధించే "దేశభక్తి గీతం; యీసురోమనీ మనుషులుంటే దేశమేగతి బాగుపడు" తుందని ప్రశ్నిస్తుంది. ఈ గీతం అంతర్గత భావాలు దేశ ఆర్థిక, పారిశ్రామికాభివృద్ధి, అధికోత్పత్తి, విదేశాలతో వాణిజ్యం, దేశ సమైక్యత, మత సామరస్యం, దేశ శ్రేయస్సు కోసం సాహిత్యం.

ఈసురోమంటూ మనుషులుండని దేశానికి యిటువంటి ప్రబోధం అవసరం వుండదు. గురజాడ కాలంలోనే కాదు, ఆయన ముందరి కాలంలోనూ, యీ కాలంలోనూ, దేశంలోని మనుషులు యీసురోమంటూనే వున్నారు. దేశంలో సగం మందికి పైగా మనుషులు, దారిద్ర్య రేఖకు దిగువ నున్నవారే; అంటే ఆకలితో లేదా అర్ధాకలితో మల మల మాడేవారు. వీరంతా పూర్వ సాహిత్యం దృష్టిలో పడని అనామకులు. గురజాడ చెప్పేవరకూ, వీరి ఉనికి సాహిత్యానికి సరిగ్గా తెలియదు. అంచేత, సాహిత్యానికి గురజాడ కలిగించిన ఇహలోక స్పృహ, దాని కాయన చేసిన మహోపకారం.

జాతి బంధములన్న గొలుసులు జారిపోవాలనీ, మతాలన్నీ మాసిపోయి జ్ఞానం వొక్కటే నిలిచి వెలుగుతుందనీ, వర్ణభేదాలన్నీ కల్ల కావాలనీ, యెల్ల లోకము ఒక్క యిల్లుగా వుండాలనీ గురజాడ ఆశయాలు, ఆదర్శాలూ, ఇవి వసుధైక కుటుంబ భావనకూ ప్రతిధ్వనులు.

వాడుక భాష ఆవశ్యకత గురించి, అది ఉద్యమ రూపంలో మొదలవడానికి సుమారు ఒక దశాబ్దం ముందర, కన్యాశుల్కం పీఠిక (1897) లో గురజాడ దానికి గట్టి ప్రాతిపదికను వేశారు. రెండో కూర్పు పీఠికలో (1909) ఆ ఉద్యమం విజయాన్ని (కన్యాశుల్కం తెలుగు సాహిత్య చరిత్రలో మహత్తర ఘటనగా మెప్పు పొందడాన్ని) వివరించారు. గ్రాంథిక భాషా వాదులతో వాదోపవాదాల్లో, గిడుగు రామమూర్తి, (1863-1940) తో కలిసి పత్రికల్లో, సభల్లో, మద్రాసు విశ్వవిద్యాలయంలో తలమునకలుగా నిమగ్నులయ్యారు. నిరాధారాలుగా, ఊహాకల్పితాలుగా వున్న యితివృత్తాల అలవాటును; పాండిత్యం లేని సామాన్యులకు అంతుపట్టని గ్రాంథిక భాష అలవాటును తిరుగులేని వాదనాబలంతోనూ, అందమైన రచనలతోనూ దురభ్యాసాలుగా నిరూపించి నూతన భాషా సాహిత్యాలను స్థాపించారు.

గురజాడ ఆరాటమంతా మంచిని పెంచడం కోసం, యీసురోమని పడి వుండే మనుషులకోసం, మనుషులు యీసురోమంటూ వుంటే దేశం ఎలా బాగుపడుతుందని ఆయన అడుగుతున్నారు. దేశం బాగుపడాలంటే,

యిటువంటి మనుషులు సుఖపడాలి. బాగుపడాలి. అందుకోసం ఉత్పత్తిని పెంచి[1] విదేశీ సరకులకు బదులుగా, స్వదేశీ సరకులు దేశంలో నింపాలి.

మనుషులకు, దేశానికి మేలు చేయడానికి, గురజాడ ఉపయోగించిన సాధనాలు, భాషా సాహిత్యాలు, దేశంలో అభిమానాలు పెంచే తీరులో వుండాలి సాహిత్యం.[2] అందుకు, అందరికీ తెలిసేదిగా, అందరకూ వాడుక చేసేదిగా వుండాలి. భాష, విషయం ఊహలోంచీ, భ్రమలోంచి కల్పించుకున్నదిగా వుండకూడదు; వాస్తవ జీవితాని సంబంధించి, మంచిని పెంచేదిగా వుండాలి. ఆ విధంగా భాషా సాహిత్యాల, గొప్ప నాగరికత సాధనాలు అవ్వాలి. గురజాడ అప్పారావు ఆశయాలు, ఆదర్శాలు ఆయన కాలానికి గొప్ప అభివృద్ధి పథకాలు, శుద్ధి కార్యక్రమాలు.

ఆయనకివి పవిత్రమైనవి, "దీక్షావిధి"గా పెట్టుకున్నవి. వీటి సాఫల్యం కోసం ఆయన చివరి శ్వాస వరకూ శ్రమించారు, ఎంతో తపించారు.

వాడుకలో లేని భాష మూలను పడింది. వాడుకలోని భాష కావ్య భాష అయ్యింది. ఊహా, భ్రమ అన్న రెండు కర్ర కాళ్ళ మీద నడిచే కావ్య వస్తువులు కొనఊపిరితో వున్నాయి. వాస్తవ జీవితం, ప్రజాహితం అన్న చక్రాల మీద నడిచే కావ్య శకటాలు అడపాదడపా కుదుపుతూ వున్నా మొత్తంమీద సాఫీగానే నడుస్తున్నాయి.

అయితే దారిద్ర్య రేఖకు దిగువను పడివున్న మనుషులు యీసురోమంటూనే వున్నారు. దేశి సరుకులు దండిగా వున్నాయి. కాని, ఎక్కువమంది మనుషుల అనుభవంలోకి అవి రాకుండా కట్టుదిట్టాలు చేయబడ్డాయి. మంచి అన్నది ఏ మాత్రం పెంచడం జరగడం లేదు. శ్రీరంగ నీతులు వల్లిస్తూ, ప్రజల్ని మభ్యపెడుతూ, మోసగిస్తూ సర్వత్రా చెడ్డ వీర విహారం చేస్తోంది. అంచేత దేశం బాగుపడే స్థితిలో లేదు.

గురజాడ తన ఆశయాలను, ఆదర్శాలను ఎలుగెత్తి చాటాక, చాలా దశాబ్దాలు గడిచాయి. స్వరాజ్యం వచ్చింది. కాని సురాజ్యం యింకా రాకపోవడం వల్ల మనుషులు యీసురోమనే పరిస్థితే వుంది. అభివృద్ధి జరిగింది. ఆ అభివృద్ధి గురించి అధికారులు అంకెలు చెప్పడమే కాదు; అది కళ్ళకు కనిపిస్తూనే వుంది. కాని అభివృద్ధి ఫలితాలు సాదా మనుషుల కందడం లేదు; జిత్తులమారి ధనిక

1. "జల్దుకొని కళలెల్ల నేర్చుకు దేశి సరుకులు నించవోయి"
2. "కవిత కోవిల పలుకులు విని దేశ మందభిమానములు మొలకెత్తవలెనోయి"

స్వాముల పాలవుతున్నాయి. ఇప్పటికీ దేశమంటే అర్థం మట్టి గడ్డలే కాని, మనుషులు కాదు.

ఇటువంటి అవ్యవస్థలో దేశాన్ని అప్రతిష్టపాలు చేసే పరిస్థితులు, సర్వత్రా సాంఘిక అవినీతి విష్క్రిములు వ్యాపిస్తూ వున్న పరిస్థితులు, దిగులు పుట్టించే తీరులో యిప్పుడు చెలరేగుతున్నాయి. నానాటికీ విషమిస్తున్నాయి. ఒకప్పుడు గురజాడ వివరించిన పరిస్థితి కంటె, తక్కువ దారుణమైనవి కానివి.

తన కాలంలోని నికృష్ట పరిస్థితుల్ని అరికట్టడానికి. సాహిత్యం నిర్వహించవలసిన పాత్ర ఏమిటో గురజాడ నొక్కి వక్కాణించారు. నైతిక భావాల ఉన్నత ప్రమాణాల్ని ప్రాచుర్యానికి తేవడం కంటె, సాహిత్యానికి ఉత్తమ కార్యమేమీ లేదు అంటూ ఎలుగెత్తి చాటారు. కావ్యాన్ని కార్యసాధనకు ఉపయోగించాలన్నారు; దానిని గొప్ప నాగరికతా సాధనంగా మలచాలని ఉపదేశించారు. ఈ అడుగుజాడను గురజాడగా భావించి, కావ్య ప్రయోజనాన్ని కార్యరంగానికి విస్తరింపజెయ్యాలి; మంచి అన్నది పెంచడానికి ఉపయోగపెట్టాలి. భాషా సాహిత్యాలు చదివాక గాలిలోనూ, ధూళిలోనూ కలిసిపోయేవి కాకూడదు; అవి సత్కార్య సాధనలో శక్తివంతమైన పాత్రను నిర్వహించాలి.

భాషా సాహిత్యాలే కాదు, సర్వకళలూ దేశ శ్రేయస్సుకు, బహుజన హితానికి సాధనాలుగా తమ పాత్రను నిర్వహించవలసి వుంది. ఇప్పటి శాస్త్రీయ సంగీతం, శాస్త్రీయ నాట్యం భక్తి శృంగారాల మయంగా వుంటున్నాయి. సాహిత్యంలో గురజాడ తెచ్చిన మార్పు వీటిలోనూ, కళలన్నిటిలోనూ రావలసి వుంది.

భాషా సాహిత్యాల విషయంలోనే కాదు, సర్వ విషయాలలోనూ ప్రజాహితాన్ని త్రికరణ శుద్ధితో కోరిన జీవితం, గురజాడ జీవితం. కన్యాశుల్కం తొలి కూర్పు ద్వారా వ్యవహారిక భాషకు ఉత్తమ సాహిత్య స్థానాన్ని కల్పించి, దాని పీఠికల్లోనూ, వ్యాసాలలోనూ తదుపరి గిడుగు మహోద్యమంగా సాగించిన వ్యావహారిక భాషోద్యమానికి అంకురార్పణ చేసిన ఘనత; ఆ వాదానికి వ్యూహ కల్పన చేసిన ఘనత గురజాడది. అతి ప్రాచీనమైన బిల్హణుని కథను వాడుక భాషలో నాటకంగా వొప్పించిన ప్రజ్ఞ; వాడుక భాషను కవితా శిల్పంలో మలచిన ఉపజ్ఞ; ఒక వేశ్యను, ఒక మాలను ("లవణ రాజు కల") ఉత్తమోత్తములుగా తీర్చిదిద్దిన శిల్ప నైపుణ్యం ఆయనవి. ఎంతో శ్రమపడి కళింగ దేశ చరిత్ర రచనకు విషయ సామగ్రిని సేకరించి, అది వాడుక భాషలో వుండకూడదని ప్రచురణ కర్త పట్టుపట్టగా నిరాకరించిన అచంచల సంకల్పం; అవసాన దశలో సైతం తాను నమ్మిన ఆదర్శాలకోసం తపించి

పోయిన కార్య దీక్ష[1]; ప్రాణం పోవడానికి క్షణాల ముందర, బతికి వుంటే ఆహార శాస్త్రం మీద పుస్తకం రాస్తానని డాక్టరుకు చెప్పిన శాస్త్రజ్ఞానాభివృద్ధి చింత – యిటువంటి మహాపురుష లక్షణాలన్నీ ఆధునిక భాషా సాహిత్యాల యుగకర్త అయిన గురజాడ అప్పారావు మేధా సంపదను, దీక్షా దక్షతలను, నిరంతర ప్రజాహిత చింతనను తెలుపుతాయి.

తనకు మానవ సమాజం పట్ల మహత్తరమైన బాధ్యత వున్నదనీ[2]; తనది ప్రజా ఉద్యమం - దానిని ఎవరిని సంతోష పెట్టడానికైనా వదులుకోలేననీ[3] ఆయన చెప్పినవి వాగాడంబరాలు కాదు. అవి ఆయన ఆచరణలో నిరూపించిన ప్రకటనలు.

అతని మరణంతో వొక గొప్ప వ్యక్తిని, వొక పరోపకార పరాయణుని, మహా పండితుని మన దేశం పోగొట్టుకున్నది....

"తెలుగు ప్రజలందరి స్మృతి పథంలో అప్పారావు సదా జీవిస్తాడు. చనిపోయినవ్పటికీ ఆయన జీవిస్తున్నాడు. అతన్ని తలచుకోవడమంటే మన జీవితాలలోని అత్యంత ఆనందమయ సంఘటనలను మనం స్మరణ తెచ్చుకు కోవడమే"[4]

సెట్టి ఈశ్వరరావు

---

1. గిడుగు సానుభూతి లేఖ.
2. గురజాడ కుమారుడు రామదాసు, గిడుగు రామమూర్తి సానుభూతి (1915 డిసెంబరు 5) లేఖ : "ఎలాగ వున్నదో చూచి వద్దామని విశాఖ పట్టణం వెళ్ళాను. అదే ఆఖరుసారి. అతన్ని చూడటం. నేనతన్ని చూడ టానికి వెళ్ళినప్పుడు డాక్టరు నా కిలా సలహా యిచ్చారు. 'మీరు యెదుట కనిపించేసరికల్లా ఆయన ఉద్రేకం పట్టలేకపోతున్నారు. అదే పనిగా, జబ్బు మాటే మరచి మీతో సాహిత్య గోష్ఠి చేస్తున్నారు. చారిత్రక విష యాల గురించీ, సారస్వతాన్ని గురించీ చర్చలు జరుపుతున్నారు. విపరీత మైన అలసట కలుగుతున్నా లెక్క చేయడం లేదు. ఇలా అయితే ఆయన ఆరోగ్యం మరీ పాడవుతుంది కదా!"
"డాక్టరు అతనికి ఉత్తరాలు వ్రాయవద్దనీ నాకు చెప్పారు. నాటి నుంచీ. అతనికి ఉత్తరాలు వ్రాయడం మానుకున్నాను, జబ్బు నిమ్మదిస్తుంది కదా, ఆరోగ్యం తిన్నబడుతుంది కదా అని ఆశిస్తూ వుంటిని...."
3. వొంగోలు ముని సుబ్రహ్మణ్యానికి ఉత్తరంలో.
4. డైరీలో.

# గురజాడ వెంకట అప్పారావు
# జీవిత వివరాలు

గురజాడ వెంకట అప్పారావు కుటుంబం, తాతల కాలంలో కృష్ణాజిల్లా గురజాడ గ్రామం నుండి విశాఖ మండలానికి తరలి వచ్చింది.

తండ్రి వెంకట రామదాసు, తల్లి కౌశలమ్మ.

తండ్రికి సంస్కృతంలో మంచి ప్రవేశం వుండేది. ఆయన విజయ నగరం సంస్థానంలో పేష్కారుగానూ, రెవెన్యూ సూపర్‌వైజర్‌గానూ, ఖిల్లే దారుగానూ ఉద్యోగాలు చేశారు. విజయనగరానికి చేరువలోని ఊడగెడ్డ అన్న ఏరు బండిలో దాటుతూ వుండగా, హఠాత్తుగా ఆ ఏరు పొంగడంవల్ల మునిగి పోయి మరణించారు.

**1862** సెప్టెంబరు **21** పుట్టిన తేదీ, జననం మాతా మహుల యింట; విశాఖ జిల్లా, ఎలమంచిలి తాలూకా, రాయవరం గ్రామంలో.

జాతకాన్నిబట్టి పుట్టుక తేదీని లెక్క కట్టడంలో తేడాలున్నాయి. ఒక దాని ప్రకారం **1861** నవంబరు **30**, యింకోదాని ప్రకారం **1862** సెప్టెంబరు **21**. ఆయన మనుమలు రెండోదాన్ని ధ్రువపరుస్తున్నారు.

తండ్రి చీపురుపల్లిలో ఉద్యోగం చేస్తున్నప్పుడు, పదేళ్ళ వయస్సువరకూ అక్కడ చదువు, తరువాత బి. ఏ., పట్టం పుచ్చుకునే వరకు విజయనగరంలో గిడుగు రామమూర్తితో కలిసి చదువుకున్నారు. ఇద్దరూ చిన్నప్పట్నుంచీ ప్రాణ మిత్రులు.

**1882** మెట్రిక్యులేషన్.

హైస్కూలు చదువు కాలంలో శ్లోకాలు రాసేవారట. విద్యాభ్యాస దశ పేదరికంలో సాగింది. ఉదారుడైన విజయనగరం మహారాజ కాలేజి ప్రిన్సిపాల్ సి. చంద్రశేఖర శాస్త్రి యింట వసతి, భోజనం.

**1882** "కుక్క" అన్న ఇంగ్లీషు పద్యం ప్రచురణ.

**1882 - 1884** యఫ్. ఏ.

1883 "సారంగధర" అన్న ఇంగ్లీషు పద్య కావ్య ప్రచురణ. తమ్ముడు శ్యామలరావూ, తానూ విజయనగరంలోని "ఇండియన్ లీజర్ అవర్," "తెలుగు హార్ప్" అన్న పత్రికల్లో ఇంగ్లీషు పద్యాలు రాస్తూ వుండేవారు. "ఇండియన్ లీజర్ అవర్"లో వెలువడిన "సారంగధర"ను మెచ్చుకొని, అప్పటి ప్రముఖ కలకత్తా పత్రిక "రీస్ అండ్ రయ్యత్" (రాజు, రైతు) అన్న ఇంగ్లీషు పత్రి కాధిపతి, శంభుచంద్ర ముఖర్జీ దానిని తన పత్రికలో రెండోసారి ప్రచురించారు. (ప్రచురణ ఆగస్టు 11, 18 సంచికలు); ఎంతో ప్రోత్సహిస్తూ ఉత్తరం రాశారు. ఇద్దరి మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు సాగాయి. ప్రారంభ దశలో ప్రోత్సహించిన వారిలో, "ఇండియన్ లీజర్ అవర్" సంపాదకుడు గుండుకుర్తి వెంకటయ్యే ఒక ముఖ్యుడు. "చంద్రహాస" అన్న యింకో పెద్ద ఇంగ్లీషు కావ్యం కూడా రాశారట. "కుక్క" లాగనే, యిది కూడా అలభ్యం.

1884-1886 బి. ఏ., ఫిలాసొఫీ అభిమాన శాస్త్రం. రెండో భాష సంస్కృతం.

1884 విజయనగరం మహారాజ కాలేజి హైస్కూలులో ఉపాధ్యాయ పదవి. జీతం 25 రూపాయలు.

1885 వివాహం. భార్య అప్పల నరసమ్మ.

1886 ఉద్యోగానికి సెలవు పెట్టి డిప్యూటీ కలెక్టర్ ఆఫీసులో హెడ్‌క్లర్కు ఉద్యోగం.

1887 కాలేజీలో నాలుగో లెక్చరర్. జీతం నూరు రూపాయలు. (విజయ దశమినాడు.)

1887 విజయనగరం మహారాజు ఆనంద గజపతి పరిచయం.

1887 విజయనగరంలో ఒక కాంగ్రెస్ సభలో ఉపన్యాసం.

1887 ప్రథమ సంతానం, కుమార్తె (ఓలేటి లక్ష్మీ నరసమ్మ).

1888 విశాఖపట్టణం స్వచ్ఛంద సేవా దళంలో సభ్యత్వం.

1889 ఆనంద గజపతి ఆస్థానంలోని డిబేటింగ్ క్లబ్బుకు ఉపాధ్యక్ష పదవి.

1890 గురజాడ "విక్టోరియా ప్రశస్తి" గీతాలు వైస్రాయి దంపతులకు రీవారాణి డిసెంబరు 12 న బహూకరించారు.

1890 ద్వితీయ సంతానం, కుమారుడు (వేంకట రామదాసు).

1891 మూడవ లెక్చరర్ పదవి. జీతం నూట పాతిక. చెప్పే పాఠాలు, ఎఫ్. ఏ., బి. ఏ., క్లాసులకు ఇంగ్లీషు, వ్యాకరణం, సంస్కృత సారస్వతం, తర్జుమా, గ్రీక్, రోమన్ చరిత్రలు.

1892 మద్రాసు లా కాలేజీలో చదువుతూ వుండిన తమ్ముడు శ్యామల రావు మరణం.

1892 "కన్యాశుల్కం" మొదటి కూర్పు ప్రదర్శనం (ఆగస్టు 13)

1894 "శ్రీరామ విజయమ్" అన్న సంస్కృత నాటక సమీక్ష. విజయ నగరం ఆంధ్రాంగ్ల పత్రిక "తెలుగు హార్ప్"లో. ఇది గ్రంథానికి పీఠికగా ప్రచు రింపబడింది. ఈ గ్రంథ రచయిత భాగవతుల లక్ష్మీనారాయణ శాస్త్రి యింకో సంస్కృత కావ్యం "సంక్షిప్త రామ చరితమ్" పీఠిక కూడా గురజాడ రాశారట. "శార్ఙ్గ దేవ చరితమ్" లేక "రాజభక్తి ప్రదీపమ్" అన్న సంస్కృత కావ్యానికి పీఠిక. "సంక్షిప్త రామ చరితమ్" అన్న జి. వి. పద్మనాభశాస్త్రి సంస్కృత కావ్యానికి పీఠిక. ఈ పీఠికలన్నీ ఇంగ్లీషులో రాసినవి.

సి. పి. బ్రౌన్ సేకరించిన చారిత్రక గాథ. "ది వార్స్ ఆఫ్ రాజాస్ బీయింగ్ ది హిస్టరీ ఆఫ్ హండె అనంతపురం" (తెలుగు) అన్న ప్రతిని, ముఖతా విని బ్రౌన్ రాయించి పెట్టిన "తాతాచార్యుల కథలు" అన్న సంపుటాన్ని సంస్కరించి ప్రచురణకు సిద్ధపరిచారు. అవి చనిపోయాక అచ్చయ్యాయి.

1895 సంస్థాన శాసన పరిశోధక పదవి.

1896 "ప్రకాశిక" అన్న పత్రికకు సంపాదకునిగా డిక్లరేషన్. ఈ పత్రిక వెలువడినట్టు లేదు.

1896 ఆనంద గజపతి భార్య మరణం.

1897 "హరిశ్చంద్ర" అన్న ఇంగ్లీషు నాటకానికి పీఠిక.

1897 "కన్యాశుల్కం" తొలి కూర్పు ఆనంద గజపతికి అంకితం, ముద్రణ. పీఠికలో గ్రాంథిక భాషలోని అసౌకర్యాలూ, యిబ్బందులూ వివరంగా చెప్పి వాడుక భాషను కావ్య భాషగా పెంపొందించడం వల్ల కలిగే మేళ్ళను నొక్కి వక్కాణించడం జరిగింది. ఇది సాహిత్య భాషగా వాడుకభాష స్థాపనకు నవ్య ఆధునిక భాష వ్యాప్తికి అంకురార్పణ.

1897 ఆనంద గజపతి మరణం.

1898 ఆనంద గజపతి అక్క అప్పల కొండయాంబ (రీవా రాణి) అంతరంగిక కార్యదర్శి ఉద్యోగం.

1902 తృతీయ సంతానం. కుమార్తె (పులిగెడ్డ కొండయమ్మ)

1903 సంతానం లేకుండా చనిపోయిన ఆనంద గజపతి, తల్లి అలక

రాజేశ్వరికి దత్తత చేసుకునే హక్కు నిచ్చారు. ఇది చెల్లదని దాయాదులు దావా వేశారు. దావా 1913 వరకూ సాగి రాజీ అయ్యింది. ఈ దావాను నడిపించే భారం అంతా గురజాడ మీద పడింది. అందువల్ల, గురజాడ భాషా సాహిత్యాల కృషి, తాను ఆశించిన మేరకు జరగలేదు.

1905 తండ్రి మరణం.

1906 పాఠశాలల్లో సులభ తెలుగు బోధనా భాష కోసం, తూర్పు జిల్లాల విద్యాధికారి జె.ఎ. ఏట్స్‌తోనూ, విశాఖపట్టణం మిసెస్ ఏ. వి. యస్. కాలేజి ప్రిన్సిపాల్ పి. టి. శ్రీనివాసయ్యంగార్‌తోనూ, పర్లాకిమిడి కాలేజి లెక్చరర్ గిడుగు రామమూర్తితోనూ, కలసి కృషి, చర్చలు, వాడుక భాష కోసం మహోద్యమ ప్రారంభం.

1906 "కొండుభట్టీయం" రచన.

1907 "నీలగిరి పాటలు" ప్రచురణ.

1918 మద్రాసు కాంగ్రెసు మహాసభలో పాల్గొన్నారు. దాన్ని గురించి ఇంగ్లీషు పత్రికల్లో వ్యాఖ్యలు ఆంగ్ల వ్యంగ్య పద్య రచన.

1909 "కన్యాశుల్కం" రెండో కూర్పు ప్రచురణ.

1910 ఆకాశంలో తోకచుక్క (హాలీస్ కామెట్) కనిపించగా కలిగిన భయాందోళనలను "చన్నకాలపు చిన్న బుద్ధులు"గా వ్యాఖ్య.

1910 సకల కులాల వారితో బరంపురంలో సహపంక్తి భోజనం.

1910 'ముత్యాల సరములు', 'కాసులు' ప్రచురణ. ఇది మొదలుకొని ఈ సంవత్సరంలో అనేక ఆధునిక కవితా గీతాలు, ఆధునిక కథలు వివిధ పత్రికలలో ప్రచురణ. వాడుక భాష కోసం వాదోపవాదాలతో, అనేక వ్యాసాలు కూడా యీ సంవత్సరంలో ప్రచురణ (వివరాలు ఆయా రచనలలో చూడ వచ్చును.) ఈ ఏడే 'బిల్హణీయం' ప్రథమాంకం ప్రచురణ అయ్యింది.

1911 "బిల్హణీయం" ద్వితీయాంకం ప్రచురణ. "లవణరాజు కల" ప్రచురణ.

1911 మద్రాసు విశ్వవిద్యాలయం బోర్డ్ ఆఫ్ స్టడీస్ సభ్యత్వం.

1911 ఆంధ్ర సాహిత్య పరిషత్తు స్థాపన. (వాడుక భాష ఉద్యమం కోసం.)

1912 కలకత్తాలో వంగీయ సాహిత్య పరిషత్తు తేనేటి పాడు జనవరి 23).

1912 "కన్యక" ప్రచురణ.

1912 రీవా రాణి మరణం.

1913 వారసత్వం దావా రాజీ.

1913 "సుభద్ర" రచన.

1913 ఉద్యోగ విరమణ; (ఫిబ్రవరి 12) పెన్షన్ రూ 140.

1913 మద్రాసు విశ్వవిద్యాలయం "ఫెల్లో" పదవి.

1914 మద్రాసు విశ్వవిద్యాలయానికి 'విశ్వ విద్యాలయాలు; సంస్కృత మాతృభాషలు' అన్న నివేదిక సమర్పణ.

1914 మద్రాసు విశ్వవిద్యాలయం పాఠ్య క్రమంలో వాడుభాషను చేర్చడానికి విరుద్ధంగా జరిగిన నిర్ణయానికి అసమ్మతిగా 'అసమ్మతి పత్రం' సమర్పణ.

1914 అనారోగ్యం.

1914 "దించు లంగరు" రచన.

1915 తన శరీర స్థితిని గురించి, అనారోగ్యం గురించి వైద్యునికి వివరణ (పంపిన తేది ఏప్రిల్ 9.)

1915 "లంగ రెత్తుము" రచన.

1915 నూతన గృహప్రవేశం.

1915 నవంబరు 30 మరణం.

1988 అక్టోబర్ 10 తృతీయ కుమార్తె పులిగెడ్డ కొండయమ్మ మరణం.

# పీఠిక

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ గడిచిన పదకొండు ఏళ్ళనుండి యిప్పటి వరకు గ్రంథరూపంలో ప్రచురించిన గురజాడ రచనలన్నిటికీ పీఠికలున్నాయి. ఇందుకు మినహాయింపుగా కవితల సంపుటం వుండిపోయింది.

నవ కవితా పితగా గురజాడ కవితల్ని, వాటి పూర్వాపరాల నేపథ్యంలో వివరించి చెప్పవలసిన కర్తవ్యం నెరవేర్చవలసి వుంది. ఈ సంపుటంలో ఆ బాధ్యతను సాధ్యమైనంత సంగ్రహంగా చెప్పడానికి ప్రయత్నం జరిగింది. ఇంతకు పూర్వపు ముద్రణలలో లేని కొరత యిప్పటి ముద్రణతో తీరింది.

ఈ కవితల సంపుటంలోని 'నవకవితాపిత'ను సిద్ధపరచడానికి మద్రాసు విశ్వవిద్యాలయం తెలుగు విభాగంలో పి.హెచ్.డి. పట్టాకి పరిశోధన చేస్తున్న కుమారి ఎన్. మేరి సుజాత చేసిన సహకారానికి ధన్యవాదాలు.

మద్రాసు
తేది సెప్టెంబరు, 21, 1995

సెట్టి ఈశ్వరరావు

# నవ కవితా పిత

తెలుగులో నవకవితకు ఆదిపురుషుడు ఎవరు? అన్న వాదోపవాదాలు చాలకాలం సాగాయి. దీని ప్రారంభకులు ఇద్దరేనని కురుగంటి సీతారామయ్య గారు, సి. నారాయణరెడ్డిగారు (1930) అన్నారు. మొదటివారు ఈ ప్రతిపాదనను తన 'నవ్యాంధ్ర సాహిత్య వీధులు' అన్న గ్రంథంలోను, సి. నారాయణరెడ్డి 'ఆధునికాంధ్ర కవిత్వము-సంప్రదాయములు, ప్రయోగములు'-లోను వ్రాసారు. సి. నారాయణరెడ్డి శ్రీశ్రీ గారిని (1910-1983) ఇంకో యుగకర్తగా పేర్కొన్నారు. వేగుంట మోహన ప్రసాద్‌గారు శ్రీశ్రీని నవ్య కవిత్వ పితామహునిగా ఉద్ఘాటించారు. ఈ ఉద్ఘాటన ఒక పత్రికలో కల్లోలం ప్రారంభానికి కారణమయ్యింది.

ఇప్పుడు ఈ వాదోపవాదాలు చల్లబడ్డాయి. శ్రీశ్రీ లెక్కకు మించినన్ని సార్లు 'అడుగుజాడ గురజాడదీ అని, ఇంకా అనేక విధాలైన సంకీర్తనలు చేసి చేసి, బాటను వేసినది గురజాడ అయినా, తాను దానిని కొద్దిగా వెడల్పు చేశాను, అని గురజాడ ఆధిక్యతను అంగీకరించారు. (విదేశాంధ్ర ప్రచురణలు-లండన్)

రాజకీయ కారణాలవల్ల ఒకరిద్దరు శ్రీశ్రీని యుగకర్తగా, అభ్యుదయ, విప్లవ, సాహిత్యాల సృష్టికర్తగా బల్లగుద్ది చెప్పి తమ వాదనను చివరకు విరమించుకున్నారు.

తెలుగు భాషా సాహిత్యాల రంగంలో గురజాడ స్థాపించినది మహోదయం. ఈ మాట కె. వి. ఆర్‌గారి పెద్ద గ్రంథానికి శీర్షిక.

మూడేళ్ళకొకసారి జరిగే అపూర్వ ఘటన మహోదయం.

## చదల చీకటి కదలబారెను :

'తమసోమా జ్యోతిర్గమయ'

వెలుగుదారి చూపిన మూలపురుషులు కందుకూరి వీరేశలింగంగారు (1848-1919) గురజాడ అప్పారావుగారు, (1862-1915) వీరిద్దరు సామాజిక భాషా సాహిత్యాల రంగంలో తిమిరంతో సమరం చేశారు.

వీరేశలింగం వీరవిహారం ప్రధానంగా సామాజిక రంగం. దానికి తోడుగా భాషా సాహిత్యాల రంగం.

అప్పారావు సమరం ప్రధానంగా భాషా సాహిత్యాల రంగం. అది సామాజిక రంగంలో మనోహరమైన, మహత్తరమైన పరివర్తనలకు సాధన మయ్యింది.

శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు కాబోలు దీనిని తిరుగుబాటుగా చెప్పారు.

దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు (1897-1980) 'దిగిరాను దిగిరాను దివినుండి భువికి' – అని చాటినా, దివి నుండి భువికి దిగివచ్చారు. చీకట్లు పోతూ సంధ్యా కాలం వస్తున్నప్పుడు గురజాడ కవితలో 'విశ్వగాన వియత్తరంగిణి భంగములు' దర్శించారు.

## తెలుగులో ఆదికాలపు కవిత్వం :

"సారమతిం గవీంద్రులు ప్రసన్న కథా కలితార్థయుక్తి లో
నారసి మేలు నా నితరు లక్షర రమ్యత నాదరింప నా
నా రుచిరార్థ సూక్తి నిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారత సంహితారచన బంధురడయ్యె జగద్ధితంబుగాన్"

నన్నయకాలంలో 'కవీంద్రు' లున్నారు. 'ప్రసన్న కథాకలితార్థయుక్తి' అంతరార్థాన్ని మెచ్చుకున్న వారేకాక, 'అక్షర రమ్యత'ను ప్రశంసించేవారున్నారు. వారి మెప్పును పొందిన "నానా రుచిరార్థ సూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహాభారత సంహితారచన బంధురు" డయ్యాడు. ఎందుకోసం? 'జగద్ధితం' కోసం.

నన్నయభట్టు మెచ్చుకున్నవారు - ఆయనను మెచ్చుకున్నవారు, తెలుగు సంస్కృత కవులన్నది స్పష్టమేకదా!

తెలుగుపైని సంస్కృతం పట్టు ఎంత - గట్టిదైనదంటే, మొట్టమొదటి యిష్టదేవతా ప్రార్థన సంస్కృత శ్లోకం - "శ్రీ వాణీ గిరిజా........" అన్నది.

నన్నెచోడుని కుమారసంభవం ఆంధ్ర మహాభారతానికి ముందరదన్న వాదన చాలకాలం వుండేది. తరువాత అది నిలువలేదు.

"మునుమార్గ కవిత లోకంబున వెలయగ కవిత బుట్టించి తెనుగున నిలిపి
రంధ్ర విషయంబున జన చాళుక్యరాజు మొదలగు బలువుర్."

నన్నయకు ముందర పద్యరచన తెలుగులో ఉన్నదనటానికి నన్నెచోడుని

కుమార సంభవం. ఇది అలభ్యమైనా, యుద్ధమల్లుని బెజవాడ శాసనం, పండు రంగని అద్దంకి శాసనం ఉన్నాయి.

పైని ఉదహరించిన పద్యంలోని 'దేశికవిత' అంటే, 'మార్గకవితను', 'లోకంబున వెలయగ చాళుక్య రాజు' మొదలైనవారు చాలమంది చేశారు.

'దేశికవిత' అంటే దేశభాషా కవిత్వం. సంస్కృతానికి భిన్నమైన కవిత్వం. దీని ప్రకారం ఆంధ్ర మహాభారతాన్ని 'దేశికవిత్వ' మనాలి.

## నిత్య ప్రవాహిని :

చాల పెద్దవి, చిన్నవి నదులు, ఉపనదులు, సెలయేర్లు, చెలమలు, ఊట గెడ్డలు మొదలైనవి నీటి వనరులు; చిన్నవి పెద్దవాటితోను, పెద్దవి చిన్నవాటి తోను కలిసిపోయి సముద్రంలోకి ప్రవహించి ఏకమైపోతాయి.

భాషా సాహిత్యాలు ఇలాగే సంగమిస్తుంటాయి. నదీనదాల విషయంలో వాటిపేర్లు మారుతూ వుండటం కద్దు. హిమాలయాల శిఖరాల్లో పుట్టి లోయల్లోంచి వల్లపు భూముల్లోకి మహాప్రవాహంగా వస్తూ వస్తూ [ఒకచోట దానిపేరు మందాకిని] వేలమైళ్ళు ప్రవహించి తూర్పు బెంగాల్లో పద్మ అన్నపేరు పెట్టుకుంది.

ఆంధ్ర మహా భాగవతంలో 'నిర్మల మందాకినీ వీచికల తూగు రాయంచ చనునె తరంగిణులకు' అని ఉంది. హిమాలయాల్లో నుండి వచ్చి పడుతున్న-మందాకిని అన్న పేరుతో ఉన్న గంగానది ఉరవడిలో రాయంచలే కాదు, మత్త గజాలు నిలువలేవే! కవులు నిరంకుశులు!

## శంభుచంద్ర ముఖర్జీ (1839-1894) :

యువ ఆంగ్ల కవి అయిన గురజాడకు ప్రోత్సాహాన్నిస్తూ విజయనగరం లోని పత్రికలో వెలువడిన 'సారంగధర'ను (ఆంగ్ల పద్య కవిత్వాన్ని 'రీస్ అండ్ రయ్యత్' అన్న తన పత్రికలో పునర్ముద్రించి ముఖర్జీ ప్రోత్సహించారు. గురజాడ రాయదల్చుకున్న రాజకీయ కవిత రాసిందీ, లేనిదీ తెలియజెయ్యమని కోరారు. చిన్న వయసులో చనిపోయిన తమ్ముడు శ్యామలరావు కూడా ఇంగ్లీషులో పద్యాలు రాస్తుండేవాడు. ఆయన గురించి కూడా సమాచారం తెలుప మన్నారు, తన మాతృభాష అయిన తెలుగులో కవిత్వం రాయమని సలహా యిచ్చారు. ముఖర్జీ ఆ కాలపు బెంగాలు మేధావులు ముఖ్యులలో ఒకరు.

'సారంగధర', 'కుక్క' అన్నవి గురజాడ ఇంగ్లీషు కవిగా మాత్రం వున్నప్పుడు రాసినవి. ఇవి శంభుచంద్ర ముఖర్జీ దృష్టినీ, ఆనంద గజపతి

దృష్టినీ ఆకర్షించాయి. అవి విజయనగరం నుండి వెలువడుతూ వున్న వొక ఇంగ్లీషు - తెలుగు పత్రికలో ప్రచురింపబడ్డాయి. 'సారంగధర'ను ముఖర్జీ తన పత్రికలో పునర్ముద్రించారు.

భాషా సాహిత్యాలూ నిత్య ప్రవాహాలే. వాటి పెరుగుదల వందల వేల సంవత్సరాలే కాదు, యుగ యుగాలు.

భాషకు అక్షర రూపం రావడానికి ముందర అనాటి మనిషి, ఈనాటి పసి పిల్లల్లా ఒక్కొక్క శబ్దమూ నేర్చుకుంటాడు. ఆ దశలో తన పరిసరాలలో, తన ప్రకృతిలో చూసిన వాటికల్లా పేర్లు పెట్టుకుంటాడు. తరువాత వాక్యాలు కూర్చుకోవడం జరుగుతుంది. పాటలు కట్టుకునే దశ వస్తుంది వానరుని నరావతార పరిణామం వందల కోట్ల సంవత్సరాలు.

తన కష్టసుఖాల్ని చెప్పుకునే దశ వాటి గురించి పాడుకునే దశ ఆ కాలంలోనే.

అవే మానవజాతి భాషా సాహిత్యాలు, అవే మానవజాతి ఆది కావ్యాలు. అనాదికాలపు పరిస్థితుల్ని, అవగాహన చేసుకుంటే భాషలోను, భావాల్లోను, ఇతి వృత్తాల్లోను, ఛందస్సుల్లోను, సులభ గీతాల రూపాల్లోను, గురజాడ సాధించినది విప్లవీకరణ.

## రైతు భజనావళి :

గురజాడ కవితావాహిని ఎన్ని పాయలుగా తెలుగు సాహిత్యంలో ప్రవహించినది తెలుసుకోడానికి గురజాడ స్ఫూర్తిని, కొద్దిగానో, గొప్పగానో అవలంబించిన తరువాతి కవుల రచనల నుండి మచ్చుకు కొన్ని :

అరవై ఏళ్ళకు ముందర ప్రచురింపబడిన 'రైతు భజనావళి' లో శ్రమ జీవుల ఆందోళనా గీతా లున్నాయి. ఇవి వామపక్ష కవులు లోకనాథం, శెట్టిపల్లి వెంకటరత్నం, తుమ్మల వెంకటరామయ్య, చదలవాడ పిచ్చయ్య మొదలగువారు వ్రాసినవి.

"మా కొద్దీ తెల్ల దొరతనము, మా ప్రాణాలపై పొంచి మానాలు హరి యించె మా కొద్దీ తెల్ల దొరతనము. పన్నెండు దేశాలు పండుతున్నాగాని పట్టె డన్నమె లోపమండీ, ఉప్పు పట్టుకుంటే దోషమండీ, నోట మట్టి కొట్టుకుపోతా మండీ, అయ్యో కుక్కలతో పోరాడి కూడు తింటామండి."

గరిమెళ్ళ సత్యనారాయణగారు [1893 - 1952] రాసిన ఈ గీతంలో నూటికిపైగా చరణాలున్నాయి. తెల్ల దొరతనం పోయింది. నల్ల దొరతనం

వచ్చి పడింది. నల్ల దొరతనం క్రింద నలిగిపోతూ వున్నా మా కొద్దీ నల్ల దొర తనము అని రాయమంటే మనసొప్పక రాయలేదు ఆయన.

శెట్టిపల్లి వెంకటరత్నం :

"ఆగునా జీవాలు, సాగునా లోకాలు రాజుగా మన మెంచి రైతు చూడక పోతె దేశాలు తల ఎత్తునా, దాస్యపున్ పాశాలు తావీడునా."

తురగా వెంకటరామయ్య :

పరమశివుడే తండ్రిరా, ప్రకృతి సుందరి తల్లిరా. దున్నరా యీ భరత భూమిని, సిరులు పండిన పుణ్య భూమిని, తిరుగులేని స్వర్గరాజ్యపు దొరవు నీ వయ్యెదవురా!"

తుమ్మల వెంకటరామయ్య (1914-1987) :

"ఎగరాలి, ఎగరాలి, మా ఎఱ్ఱ జెండా, అదురు బెదురు లేక అడ్డేది యును లేక, సామ్రాజ్య వాదంబు సమసి పోవంగా, ధనిక వాదం బింక దగ్ధమై పోవ, కూలోళ్ళ గొంతులో కొన ఊపిరుంటేను. పేద రైతు మేన వేడి రక్తం బుండె, కార్మికుల్, కర్షకుల్ కరము కరము కలిసి, జై మనకు జైయంచు, జైయంచు జేజేలు కొట్టంగ...."

చదలవాడ పిచ్చయ్య (1911-1987):

"ఆకలి, ఆకలి, మండే ఆకలి, నీతి నియమములు జాతి భేదముల పాటిం చొద్దనె ఆకలి, ఆకలి...."

వెండ్యాల లోకనాధం:

"కూలీలందరు ఏకమైతే కూటికి తరుగేమిరా, కూలివాండ్లలోనే బల మీ కాలమందున నుండెరా, కూలివాండ్లమైన మనము కులము లెందుకు తెలుపరా, కూలివాండ్లము మనము కలసియుందము సోదరా, కష్టపడియు మేడలన్నీ కట్టినది మనమే కదా...."

## ప్రజా నాట్య మండలి :

కొన్నాళ్ళ తరువాత ప్రజా నాట్య మండలి స్థాపన జరిగాక డాక్టరు రాజా రావు నిర్వహణలో, సుంకర సత్యనారాయణ, వాసిరెడ్డి భాస్కరరావు, నాజర్, పెరుమాళ్ళు, కోడూరు అచ్చయ్య, కోగంటి గోపాలకృష్ణయ్య, మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, కొప్పరపు సుబ్బారావు, మోహన్‌దాసు, చలపతిరావు మొద లైనవారు ఎన్నో కళారూపాలు, నాటకాలు, నాటికలు సర్వాంధ్రంలోను

ప్రదర్శించారు. అవి లక్షలాది మంది ప్రేక్షకులను పరవశింపజేసేవి, ఉత్తేజ పరిచేవి. వీటిలో మహిళలు విరివిగా పాల్గొవడం ఒక విశేషం. ఇవి గురజాడ సాహిత్యోద్యమానికి చేదోడు వాదోడుగా వున్నవి. వివిధ రూపాలలో విస్తరిస్తు న్నాయి.

## గురజాడ సాహిత్య గంగోత్రి :

గురజాడ తరువాత వచ్చినవి మూడు - నాలుగు తరాలు. వీరిలో కొందరు మార్గ కవితలు రాసినవారు. చాలామంది కాలక్రమాన ముత్యాల సరాల వంటి గీతాలు, పాటలు రాశారు. చింతా దీక్షితులుగారి వంటివారు భగవద్గీతను, వాడుక భాషలో తెనిగించారు. అక్కిరాజు ఉమాకాంతం వంటివారి అనుయాయి, ఒకరుకూడా దానిని వాడుక భాషలో తెనిగించారు. రాయప్రోలు వేగాతి వేగో క్తి దుర్వ్యసనం' [అష్టావధానాలు] మాని సులభ భాషలో రచనకు మారారు, ముత్యాల సరాలలో గీతాలు రాశారు.

## ఉప శీర్షిక :

శివశంకర శాస్త్రిగారు (1882 - 1979) గురజాడ వారసులమని చెప్పు కున్నా, "పాక కృత్యముల పరిసమాప్తిలో అవశిష్టములేమైనను కలవా?' వంటి శైలిలో రాశారు. ఇంకో వైపు కృష్ణశాస్త్రి "....మతం వద్దు గితం వద్దు మారణ హోమాలు వద్దు" వంటి పాటలు, విద్యార్థి సభల కోసం జంపా పాటలు రాశారు. పూర్వపు దంతపు మేడమీంచి దిగివచ్చి, మాటల నగీషీలు వదలిపెట్టారు.

"సడిలేని నడి రేయి/పడిపోయినట్టి/నీ కడియాల రవళులే/చిరుగాజు మ్రోతలే/కేలెత్తి చూపు జీవిత పథమ్ములు నాకు/ఎలుగెత్తి నన్పిలుచు."

కృష్ణశాస్త్రిగారు కాల ప్రభావం వల్ల దివి నుండి భువికి దిగి రాక తప్ప లేదు. చివరిదాకా యిక్కడే వుండిపోయారు.

గతంలో శైవ కవులు, గురజాడకు చాల ముందర తేట మాటలకు కట్టు పడి వుండేవారు. మొల్ల తన రామాయణంలో—

"తేనే సోక నోరు తియ్యన యగు రీతి దోడ నర్థమెల్ల దోచకున్న గూఢ శబ్ద వితతి కొట్లాట పని యెల్ల మూగ చెవిటివాని ముచ్చటరయ"

## గురజాడ తరువాత పెద్దా, చిన్నా :

గురజాడ కవిత్వ రచన జరిగింది ఐదేళ్ల మాత్రమే (1910 - 1915). ఆయన రాసిన గీతాలు 'ఆంధ్ర భారతి' అన్న మచిలీపట్నం పత్రికలో ఎక్కువ భాగం వచ్చాయి.

"ప్రేయసి లేచి రమ్ము జివురించిన మావుల క్రింద
శీతల చ్ఛాయలలోన యవ్వన వసంత
శుభోదయ మయ్యె నవ్వుచున్ చేయికి జేయి చేర్చి
పర చింతలన్ మరపించు రాగముల్ దీయుచు
వాసనల్ పరిమళించెడు చోటుల యందు బోవగన్."

పై పద్యం అబ్బూరి రామకృష్ణారావుగారిది. (1896-1979) రామకృష్ణారావుగారు, రాయప్రోలు సుబ్బారావుగారి సమకాలీనుడు. మరణ శయ్యపై నుండి ఆయన చెప్పిన గీతం :

"చచ్చిపోయి జీవి యెచ్చటి కేగునా
ఏమి యగునొ ఎవరి కెరుక రాదు
ఎరుక లేని వారలేమేమొ చెప్పగ
పరితపించు వారు వేనవేలు."

పింగళి లక్ష్మీకాంతంగారు (1894 - 1972), కాటూరి వెంకటేశ్వరరావు గారు (1895 - 1962) జంటగా రాసిన 'సౌందరనందము' ప్రసిద్ధ కావ్యం.

"అమృత పరిపూర్ణమైన పాత్రము నందు
చేతులారంగ విసము పోసితి వయారె
అనుభవింపగ మనసు లేదయ్యనేని
పాత్రమున దొల్త బొరగింపంగనేల?"

పై పద్యము కావ్యనాయిక శోకంలోనిది. నూతన దంపతుల్లో వరుడు గౌతమ బుద్ధుని సమీప బంధువు. అతనికి బుద్ధుడు తన మతదీక్షనిచ్చి తనవెంట తీసుకుపోతాడు.

నాయని సుబ్బారావు (1899-1978) :

"ఎవ్వడా క్రూర కర్ముకుడెవ్వడు నేల
బంధ విముక్త శైశిర శార్వరి ప్రా
శాంత మలవాటుపడిన నిశాంతమందు
అకట నట్టింట దీపము నార్పినాడు

ఎవ్వడా విరసాత్ముడెవ్వడు సాంధ్యరాగ
మంజుల రేఖా విరాజమాన
మంగళాకాశ సీమంత రంగమందు
కాపుచీకట్ల రాసులు గ్రక్కినాడు.

ఎవ్వడా నిర్దయ స్వాంతుడెవ్వడు నన్ను
గంటక నిగూఢవిపిన మార్గముల దల్లి
లేని బిడ్డను గావించి మానసంపు
బాధలన్నియు నడుగంట గోసినాడు."

**మూస ఒక్కటే :**

శిష్లా ఉమామహేశ్వరరావు, శ్రీరంగం నారాయణబాబు (1906-1961) శ్రీశ్రీ (1910-1983). ఈ కవులు ముగ్గురు సమకాలీనులు ఒకే తరగతికి చెందిన కవులు.

శిష్లా ఉమామహేశ్వరరావు (1912-1953) :

"ఇటు వెన్నెల అటు వెన్నెల నడి శిరస్సుకు శ్రీ వెన్నెల
ఇటు వెన్నెల అటు వెన్నెల ఈశ్వరునకు తలవెన్నెల"

ఈయన శ్రీశ్రీకి కొంత ముందర కవిత్వరచన ప్రారంభించారు. శిష్లా తనను ఉత్తేజపరిచారని శ్రీశ్రీ చెప్పారు.

శ్రీరంగం నారాయణబాబు (1906-1961) :

"నేడు కవితా కామినికే వచ్చింది ఖాయిలా
అసలు గూటిలో నుంచే అదృశ్యమైందా కోయిలా
కల్పనకిది కానిరోజు
కవి కంఠంలో పట్టింది బూజు
కలదింకా నీకొక రోజు దులుపు బూజు

శ్రీశ్రీ (1910-1983) :

"అవును వాహనం మారింది దూరానికి పూర్వపుటర్థం పోయింది
పూర్వం దూరం పోయింది, వెనుకటి వాహనం మారింది
ఆ చంద్రుడే నేడు
ఆ చంద్రుడీ నాడు
అవే నక్షత్రాలు అయినా కాలం మారింది
ఔనా! కాలం మారింది మరి,
మానవుడా మేలుకో నేస్తం!
ఎద్దుల బండితో కొలపకు దూరాన్ని, ఎగరవోయి చదల యెద చీలుస్తూ
రేపు బయలుదేరాలనుకున్నావు
నేడే ఇచ్చటికి వచ్చేశావు."

## పఠాభి (1919) :

పఠాభి సాహిత్యం ఫిడేల్ రాగాల డజన్ వగైరా ఆధునిక సాహిత్యమే. 'కామాక్షికోక' వంటి రచనలు వెలివేయడం మంచిదా, చెడ్డదా అన్న తర్కం ఎవరికి తోచినట్టు వారు చెయ్యవచ్చు. వాటిని తగలబెట్టడం తగదు. అన్నీ సాహిత్య భండారంలోనివే. పఠాభి సాహిత్యం ఒక రకం అయితే ఆయన జీవితం యింకో రకపుది. ఆయన రాజకీయంగ లోహియా సోషలిస్టు, సంస్కరణ వివాహం. 'సంస్కార' వంటి తిరుగుబాటు కన్నడ నవల సినిమా నిర్మాణం.

## కోకిలమ్మ పెండ్లి :

విశ్వనాథ సత్యనారాయణ సైతం దివినుండి భువికి దిగి 'కిన్నెరసాని పాటలు', 'కోకిలమ్మ పెండ్లి', 'గిరికుమారుని ప్రేమ గీతాలు', రాశారు. 'కోకిలమ్మ పెండ్లి'లో కొన్ని భాగాలు.

"ప్రొద్దుకుంకె వేళ వెన్నెల
ముద్దుగా కాసింది జాబిలి
చావు లేనేలేదు ప్రేమకి
చావు లేదంది.

వానలన్ని వెనుకపట్టి
కోనలన్ని నీరువట్టి
అకురాలే కారు కూడ
ఆగిపోయింది.

కోకిలమ్మ అదుగో మళ్ళీ
కూ సెనంటె కూ సెనాని
వచ్చెనంటె వచ్చెనాని
బ్రతికెనంటె బ్రతికెనాని
వొళ్ళు తెలియక అడవి పూటా
పొర్లి పోయింది
చెమ్మ తరగని మావియోకా
చివురు తొడిగింది
అంతలోపల నడవికందం అతిశయించింది."

'రామాయణ కల్పవృక్షం' లోని పాషాణ పాకానికి, ఈ గీతానికి ఎంత దూరం!

అలూరి బైరాగి (1925-1978) :

ఈయన కవితలు చప్పున అర్థంకావు. కాని, ఆయన ప్రతిభాశాలి అవును

"కీర్తిస్తున్నాను నేను మంటిని పుట్టి పెరిగే మహాజనులను
కీర్తిస్తున్నాను నల్లని హిమగిరుల వంటి వారి దేహాలను
దేహసానువుల స్రవించి చెంగలించే శ్రమవారి ప్రవాహాలను
కీర్తిస్తున్నాను నేను కూలీలను రైతులను."

ఆరుద్ర (1925) :

"నీ ఈప్సితాల ట్రంకుపెట్లు బ్రేకులో పడేయ్యి
నువ్వు తెచ్చుకున్నవన్నీ ఎక్కించేలోపున కదిలిపోతుంది బండి"

అనిసెట్టి సుబ్బారావు (1922-1981) :

"వచ్చగ ఈ నేలంత ప్రాణముబుకుతుందేమిటి?
కార్చిచ్చులలో మండిన కదలి పొంగుతో నిండిన ప్రాణగోళమంతా
ఈ పసరు కారుతుందేమిటి
చరమరాత్రి క్రిక్కిరిసిన ప్రళయ సమర సంఘర్షణ
జారిన వీరుల రక్తం ఆరని వనితల దుఃఖం."

కె. వి. ఆర్. (1928) :

"ఎంతగొప్ప సాలెగూడు
వింతచెంది చూచినాను
స్వాధీనం తప్పిరేయి
చైతన్యం మరచివేయి
కలనడకల పిపీలికల
ఖైదుకొట్టు వెన్నెలవలె
ఎంత కొత్త సాలెగూడు
భ్రాంతితోడ చూచినాను."

రెంటాల గోపాలకృష్ణ (1922-1995) :

"మానవుడా!
జీవితం ఒక చిక్కుముడి
జీవితం ఒక తప్పగడి
ఈ ముడి విప్పలేవు

ఈ గడి తప్పలేవు
సీత ఒక మహోన్నత శిఖరం
ఈ శిఖరాన్ని చేరలేవు.

మానవుడా!
జీవితం ఒక స్వయంవరం
ఇది నిన్ను వరించదు
జీవితం సర్పాల సరోవరం
ఈ విషజలంలో ఈదలేవు."

## నయాగరా కవులు :

నయాగర కవులుగా ప్రసిద్ధికెక్కిన బెల్లంకొండ రామదాసు, కుందుర్తి ఆంజనేయులు, ఏల్చూరి సుబ్రహ్మణ్యం కలసి కూర్చిన సంకలనం నయాగరా అయిదు దశాబ్దాల క్రితం ప్రచురింపబడింది. ఏల్చూరి సుబ్రహ్మణ్యం కవితలోని కొన్ని పంక్తులు :

### ఏల్చూరి సుబ్రహ్మణ్యం (1920-1995) :

"ఈ ధేనువు కన్నులలో/తళుకొత్తిన పృథుశక్తి
దానవతను భంగించను
ప్రభవించిన కౌముది
ఎపుడు సృష్టించావు మనిషిని
ఎపుడు విప్పిన చటుల నేత్రం

సహస్రాక్షికి. కర్మసాక్షికి
తెన్నుచూపే తేరు తెచ్చెను
పుట్టబట్టి, గుట్టబట్టి
కొండచుట్టి కోనచుట్టి
తిరిగి వచ్చు తిన్నని
హృత్పాలా పగిలెనెట్లు."

### కుందుర్తి ఆంజనేయులు (1922-1982):

ఈయన వచన కవిత్వ ఉద్యమకారుడు. ఈయన స్మారకార్థం వచన కవితలు వ్రాస్తున్న యువకవులకు బహుమతు లివ్వడం జరుగుతూంది. వచన కవిత అని చెప్పినా, ఉద్యమంగా యేళ్ళతరబడి సాగించినా కుందుర్తి అంతర్ లయను, వైచిత్రిని తప్పించుకోలేదు,

"నాకూ తుది విశ్వాసానికి మధ్య
నలభై యేండ్ల దూరం వుంది సుమారుగా
ఈలోగా కవిత్వం మేమూ వ్రాస్తామని

రోగాలు ముందుకొస్తాయి నాకు మారుగ
మృత్యువు మీద నాక్కాసి, ముందే రమ్మని కూచుంటుంది
ఏం పుట్టి మునిగిందని ఏటేటా ఈ పిలుపులు
ఎవరికోసం తెరిచే వుంచుకుంటుందీ తలుపులు."

బెల్లంకొండ రామదాసు (1923-1983) :

వెడుతాను మరి, సెలవు
విడిచి వెడుతున్నాను నా కండ్లు
వెలలేని కలల బరువెక్కి
పండి రాలిన పండ్లు
వెదికి వేసారి విశ్రయించిన వుండ్లు
వెడతాను మరి, సెలవు
ఎన్నో దినాలు గడిపాను మీ మధ్య
ఎన్నో దినాలు నడిచాను ఈ రధ్య
వెడతాను మరి, సెలవు
ఎన్నో దీపాలు వెలిగించుకుని వచ్చాను
ఎన్నో కలలు మోసుకొని వచ్చాను
ఎన్నో జలలు నింపుకొని వచ్చాను.
ప్రవేశించాను
ఈ విచిత్ర భవనంలోకి
ఈ విశాల సదనంలోకి
పాటవలె
పరిమళం వలె
మాటరాని మౌనివలె
ఎన్నో ముఖాలు కనిపించినవి
ఎన్నో కండ్లు ఎక్కుపెట్టినవి నాపైన
ఎన్నో గుసగుసలు రుసరుసలు
ఎన్నో కంఠాలు ప్రశ్నించినవి

నీవెవరు ? నీవెవరు ? నీవెవరు ?
నే నెవరు ? నే నెవరు ? నే నెవరు ?

నండూరి సుబ్బారావు (1895-1961) :

"యెన్నెలంతా మేసి యేరు నెమరేసింది"
"కన్నె త్తితేసాలు కనకాభిసేకాలు"
"యేత మెత్తేకాడ యెదూరుగ కూకుండి
మళ్ళా యెప్పట్లే తెల్లారబోతుంటే
చందురుణ్ణీ తిట్టూ నా యెంకి
సూర్యుణ్ణీ తిట్టూ నా యెంకి"

కవి చదువు సంస్కారాలు యెంకి పాటల్లో ప్రతిధ్వనిస్తాయి. అయినా దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి దూషణ "నాజూకు లేదురా నండూరి సుబ్బిగా" అన్నది సబబైనది కాదు.

పురిపండ అప్పలస్వామి (1904-1987) :

"తొలినాటి సంద్రాలు తుహినగిరి శిఖరాలు
ఇంకిపోతున్నాయిలే కృంగిపోతున్నాయిలే
తాతవేసిన పుంత దైవమెరిగిన సత్రా
పల్లేరు పాకిందిలే జిల్లేడు మొలిచిందిలే."

## కాల్పనికోద్యమం భావకవిత్వం :

పాతిక ముప్పైఏళ్ళు మారుమ్రోగిన భావకవిత్వమనబడె దాని గురించి దేవులపల్లి కృష్ణశాస్త్రి చేసిన విశ్లేషణ గమనించవలసింది.

"దీనికి పునాది వేసింది గురజాడే. రాయప్రోలు, బసవరాజు కొంత నిర్మాణం సాగించగా నాయని ప్రభృతులు శిఖరం కట్టారు" అని చెప్పి –

"శ్రీశ్రీ ఆవేశం కాల్పనికోద్యమానదే. భాషకూడ అంతవరకు కావ్య భాషగా వస్తున్నదే. కాని దీనితోనే కొత్త కాహళలివి, దుందుభులివి, మ్రోతలు మోగిస్తాడు" అని వివరించారు.

అబ్బూరి రామకృష్ణరావు (1896-1979) :

మార్గకవితలో పాడుకునే ఛందాలు అనేకం ప్రవేశపెట్టి తరువాత వచ్చిన వారికి మార్గదర్శకులయ్యారు. రామకృష్ణరావుగారి పద్యం ముందు ఉదహరింపబడింది,

దువ్వూరి రామిరెడ్డి (1895-1947) :

"జీవనగంగా హరిత తటంబున
చింతావటచరు మూలమునన్
ఏల యథోముఖివై గడుతెంచెద విప్వధి
యౌవన నిశలన్."

"గాలియడుగుల నెవరికోసరము
ఓ మోహశీల !
కదలివచ్చితివీ నిశీథమున
కాలియందెలు ఘల్లుఘల్లుమనియో
ఓ వలపురాణి
కేలగైకొని మెల్లనడచెదవు."

పుట్టపర్తి నారాయణాచార్యులు (1915-19 ) :

'శివతాండవం' చదివినా వినినా తాండవం కంటి ఎదట కనిపిస్తుం దంటారు.

"ఏమానందము ? భూమితలమున !
శివతాండవమట ! శివలాస్యంబట !
అలలై బంగరు కలలై పగడపు
బులుగుల వలె మబ్బులు విరిసినయవి
శివతాండవమట ! శివలాస్యంబట !
వచ్చిరా యేమొ ! వియచ్చరకాంతలు
జలదాంగనలై విలోకించుటకు
శివలాస్యంబట !"
ఇదే విధంగా 72 పుటల కవితా ప్రవాహం !

బసవరాజు అప్పారావు (1894-1933) :

ఈయన, వింజమూరి రంగాచారి, అధికార్ల సూర్యనారాయణరావు ఈ విధంగా వ్రాయడానికి మరోప్రక్క రాయప్రోలు, అబ్బూరి, వేంకట పార్వతీశ్వర కవులు ప్రాచీనాధునిక కవితల మధ్య వంతెన కడుతుండేవారు.

"బ్రతుకు బరువు మోయలేక
చితికి చివికి దస్సివాడి
పికరుపుట్టి పారిపోయి

ఒక్కణ్ణే యే తోటలోనో
పాటబాడుతుండగా నా ప్రాణి యేగేనా ?
ప్రాణిదాటి యేగుతుంద పాటనోట మోగేనా !"

## అడివి బాపిరాజు (1895-1952) :

"ఉప్పొంగిపోయింది గోదావరి తాను
తెప్పున్న ఎగిసింది గోదావరీ
కొండల్లొ ఉరికింది
కోనల్లు నిండింది
ఆకాశగంగతో హస్తాలు కలిపింది
అడవి చెట్లన్ననీ
జడలలో తురిమింది."

"చిత్తరంజనదాసు చిన్నారి కొడుకును చెయ్యివిడిచి చెరబెట్టినారు."

ఈ రెండు పంక్తులు బాపిరాజుగారి జాతీయ గీతం లోనివి.

## కవికొండల (1898-1964) :

"మొగములను ముచ్చెమట లూడ్చుచు
మూపులను పెనుమోకు లీడ్చుచు
మడమలెత్తున మన్ను రేచుచు
గుండ్లు పేరూ కులుకుపాటేమో ! ఏమో !
పాలిండ్ల పగడపు గుండ్ల పేరేమో !
ఇనుప బరువుల 'నిస్సి' యనుచును
వెచ్చనన్నపువేళ కనుచును
మెట్టనడ కుట్టుసుఖ గొనుచును
కాళ్ళకడియాల్ కలికి నుడి యేమో ! ఏమో !"

## దాశరథి (1927-1987) :

"పిచ్చుకపై బ్రహ్మాస్త్రం
వేసే వారున్ననాడు
అవనిపైన శాంతిలేదు
అనిసేయుట ఆగిపోదు.

ఎత్తులపై ఎత్తులతో
జిత్తులపై జిత్తులతో
ఎత్తే విజయపతాకం
ఎన్నాళ్ళని యెగురుతుంది.

సురక్షిత స్థలాలలో
సుదూర ప్రాంతాలలో
కూర్చుని నాయకమ్మన్యులు
తీర్చుతారు కుపథకాలు.

వేలమైళ్ళ దూరాన
విలయ తాండవం చేసే
మృత్యు దంష్ట్ర లందు పడి
పిండై పోయేది ప్రజలు

ఎంత వినాశం జరిగెను ?
ఎందరి అసువులు పోయెను
బ్రతికి ఉన్నవారి యెదల
చితులెన్ని రగుల్కొనెను !"

సి. నారాయణరెడ్డి (1930) :

"కాలం కేలెత్తి పిలుస్తున్నది
కంకాళం లేచి నడుస్తున్నది
పొగచూరిన బ్రతుకులతో
పొగిలిన నరజాతి ధరా
గగనాలకు వంతెన కడుతున్నది

సమరాలకు సమాధి అవుతున్నది
శాంతికి పరిణయం జరుగుతున్నది
విషదంష్ట్రా విముక్తమై
విశ్వంభర కార్తీకపు
వెన్నెల్లో జలకమాడుతున్నది.

వెనక చూపు ప్రక్క ముడుచుకున్నది
ముందు చూపు రెక్క విప్పుతున్నది

చివికిన తాటాకు పుటల
చెరిగవేసి చరిత్ర బం
గరు చిగురాకులను తొడుక్కున్నది.

దేవరకొండ బాలగంగాధర తిలక్ (1921-1966) :

"ఉగాదికి నీకు ఏం వ్రాయను
సగానికి సగం తియ్యని అబద్ధాలు
సరదాగా చెప్పనా ?
పరదాలో దాక్కున్న నిజాల్ని
బయటికి తీసి విప్పనా ?

అతృప్తాలైన కళ్ళు
ఆతృతతో అలసిన వొళ్ళు
అబద్ధంలో చుట్టబెట్టిన రాళ్ళు
ఏ భూమ్మీద కట్టుకోమంటావు
పొడియిసుకతో యిల్లు
ఏ ఆకాశంమీద జల్లమంటావు
అడియాసల పువ్వొళ్ళు.

దట్టమైన మంచుపడిన చీకట్లో, అలాగే వెతుక్కుంటున్నాను.
నన్ను నేను, నాలో నీలో గతంలో
మనని మనం పోగొట్టుకున్న దినం మహాలయ అమావాస్య
ప్రతి ఉగాదికీ యుగయుగానికి మెరుస్తూ పిలుస్తుంది ఆశావేశ్య."

**తెలంగాణా సాయుధ సమరం :**

గంగినేని వెంకటేశ్వరరావు :

"నాకు తెలియక అడుగుతా
నీ కళ్ళు జనకారి పోయా
ఎందుకో చెప్తావమ్మా ?"

"అది తెలియదా నాయనా
మలబారు పోలీసులు
ఒకనాడు కొడుకు జాడ
చెప్పమని కళ్ళు పొడిచారు."

"అయితే బాబూ
పోయిన శివరాత్రినాడు
కోటప్పకొండ నాతో ఎక్కావే,
ఇప్పుడు మూడుకాళ్ళ ముద్దవయావేం ?"
"ఏమని చెప్పను బాబూ.
హింసాకాండకు తలదించకపోతే
పోలీసులు మోకాళ్ల కాల్చిపారేశారు."
"అమ్మాయీ పదహారేళ్ల నిండీ నిండని
నీ నోరు బోసి కొడుతుందేం ?"
"ఆరు నెలలు విచిత్ర హింసతో పళ్ల
ఝల్లున రాలేయని వినలేదా ?"
"అమ్మా, అబ్బాయి ఎక్కడికెళ్ళాడు ?
ఇంకా వాడెక్కడ నాయనా ?
కొండంత కొడుకును
క్రూరులు దిగమింగారు."

ఈ కవి సాయుధ సమరం తీవ్రంగా సాగుతోన్న రోజుల్లో ఆ చోట్లకు వెళ్ళడమూ, హింసలకు గురికావడం జరిగింది.

సంభాషణల రూపంలో పై నున్న గీతం, ఆయన గీతాల సంకలనం 'ఉదయిని' లోనిది. తెలంగాణా గ్రామాలలో తాను చూసినవీ, విన్నవీ 'ఎర్ర జండాలు' అన్న పేరుతో మూడు వచన గ్రంథాలు కూడా రాసి ప్రచురించారు.

ఇవే కాదు, సమరం సాగుతోన్న కాలంలో నిరక్షరాస్యులు, సమరంలో పాల్గొన్న నిరుపేదలు ఆశువుగా చెప్పిన పాటలు ప్రజలు పాడుకొని ఉత్తేజ పడేవారు. మచ్చుకు వొకటి - నైజాము సర్కారోడా, నాజీలను మించినోడా అని మొదలవుతుంది.

పాదుషాను ధిక్కరించి, నీ సింహాసనం కదులుతోంది అని ఆవంత్స సోమసుందర్ ఖబడ్దార్ చెప్పారు.

షేర్వాణీల రాజ్యం పోయి, గాంధీ టోపీల రాజ్యం వచ్చాక, వినోభా భావే గారి భూదాన ఉద్యమం నోరూరించిన తరవాత, తెలంగాణా వీర ప్రజలు తాము ఆక్రమించుకున్న భూముల్ని కొంతవరకైనా తమ అధీనంలో పెట్టుకో గలిగారు.

ఈ సమర ప్రభావం, ధనిక ప్రభువుల బూటకం స్పష్టమవుతున్న కొద్దీ సమూల పరివర్తనలకు దారి తియ్యక తప్పదు.

ఈ సాయుధ సమరం గురించి ఎంతో సాహిత్యం వెలువడింది. వీటిలో ఎన్నో ఖండ కావ్యాలు గ్రంథ రూపంలో వెలువడినవి మూడు. గంగినేని 'ఉదయిని' కాక, ఆరుద్ర 'త్వమేవాహం' పేరుతో కవితా గ్రంథం రాసి ప్రచు రించారు. ఈ గ్రంథంలో చిత్రాతి చిత్రమైన టెక్నిక్, దానికి స్ర్రియలిజం పులిమేరు. ప్రచురణ కర్తలే యీ టెక్నిక్‌ను కొరకురాని కొయ్యగా ముద్ర వెయ్యడం జరిగింది. సమరం కాంగ్రెసు ప్రభుత్వం చేసిన దగావల్ల విఫలమైంది. ఇందుకు కవి విలాపం కావ్యంలో ప్రముఖంగా వ్యక్తమయింది. పై రెండు పుస్తకాలేకాక, కుందుర్తి రాసిన 'తెలంగాణా' మూడోది. ఇది కవితా గ్రంథంగా బాగున్నప్పటికీ, వున్న విషయం రాజీ ప్రతిపాదన.

## తియ్యని కల :

కవిత్వం వల్లనో, సాహిత్యం వల్లనో సమాజం మారిపోతుందని భ్రమిం చడం, ఒక తియ్యని కల. సమాజ పరివర్తనకు ప్రధానంగా రాజకీయ పరిస్థితులు కారణమవుతాయి. మంచికీ, చెడ్డకూ ఇతర విషయాలు పక్క వాద్యాలు వంటివి. మనుషుల మనసులను, గుండెలను మార్పుల దిశగా మళ్ళించే ప్రయత్నాలు, పోరాటాలు కొన్నికొన్ని సందర్భాలలో ప్రతిఘటనకు ఎదుర్కోవలసి వుంటుంది. సామాజిక పరిస్థితుల్ని ఒకదాని నొకటి ప్రభావితం చేస్తాయి. తాను రాసిన రాతలు చదివి జనం సముద్రంలాగా వుప్పొంగి పోతారనుకోవడం ఊహ మాత్రమే. పరిస్థితులు కలిసి రాకపోతే స్వరాజ్యం, స్వరాష్ట్రం వచ్చేవా, వాటికి లెక్కలేనన్ని వంకర టింకర్లు మసక కళ్ళకైనా స్పష్టంగా కనిపిస్తున్నాయి. అవునా?

## స్ర్రియలిజం :

అతి వాస్తవికత. అధివాస్తవికత దీనికి మారు పేర్లు. మొదటి ప్రపంచ యుద్ధం ముగిసిన తరువాత విద్యావంతుల్లో, ముఖ్యంగా యూరప్‌లో దారితప్పిన వారు, దారి తెలియనివారు చాల మంది అల్లకల్లోలం రేపెట్టారు. స్ర్రియలిజానికి తోబుట్టువులు ఇమేజిజం, డాడాయిజం, ఎగ్జిస్టెలియజం మొదలయినవి, వీటిని మనోవికాసాలుగా అనుకోవచ్చును. కాని, వీటిని తల కెక్కించుకున్నవారు యివి లోకంలో వ్యాపించక తప్పదన్న ధైర్యంతో వుండేవారు. స్ర్రియలిజానికి వేదం 'యులిసిస్' అన్న గ్రంథం, స్ర్రియలిజానికి పితామహుడువంటి ఆంద్రీ బ్రిటన్ కొంత కాలానికి మేలుకొని, యీ మతాన్ని వదలిపెట్టాడు. ఫ్రాన్సులో కమ్యూ నిస్టు మేధావులు కొందరు ఈ మైకానికి కొంతకాలం గురయ్యారు. పాబ్లోపికాసో అన్న ప్రపంచ ప్రఖ్యాత చిత్రకారుడు యీవలలో చిక్కుకొని, యీ యిజాలను

తన చిత్రకళా సంవిధానికి ఆలంబనగా పెట్టుకున్నాడు. ప్రస్తుతం ఇవి వాటంతటవే అంతరించిపోయాయి.

తెలుగులో ఒక అరడజను మందికి తక్కువగా, శ్రీశ్రీ దిగుమతి చేసిన సర్రియలిజానికి మద్దత్తు యిచ్చారు. 'అధివాస్తవికుల ప్రవేశం' అన్న పేరుతో శ్రీశ్రీ సర్రియలిజం కవిత్వ ప్రణాళికను ప్రచురించారు. తక్కిన ఉత్సాహకులు శ్రీరంగం నారాయణబాబు, జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి, మైనారిటీ దాటని అరుద్ర కొద్ది కాలంలోనే యిది కాలగర్భంలో కలిసిపోయింది. శ్రీశ్రీ పద్యం లోని మాటల కూర్పు 'కాసరమా వికారములు కార్చకు........ వగైరా, దీనిలోని భావాల్ని తిరుమలేశుణ్ని అడిగి తెలుసుకోవాలి. రోణంకి అప్పలస్వామి, చాగంటి సోమయాజులు యీ ఊరేగింపులో కొద్ది రోజులు మాత్రం వున్నట్టున్నారు.

అల్లకల్లోలాలు, అల్లర్లు చెలరేగుతున్నప్పుడు సజ్జనుల వేషాలు వేసుకొని ఆషాడభూతులు, మారు గొంతుకులతో గురజాడ సుభాషితాలు ఎడతెరపిలేకండా వల్లిస్తుంటారు. చెట్టు పేరు చెప్పి కాయలమ్ముకోవడం సాహిత్యంలోను వ్యాపార నీతే. సర్రియలిజంవంటి వికారాలకు గురజాడ ప్రబోధాలను చిత్తశుద్ధితో మననం చేయడం ఒక్కటే ఔషధం. చిత్తశుద్ధి లేని శివపూజలు, భాండ శుద్ధిలేని పాకాలు యోగ్యులు దూరంగా వుండవలసిన విషయాలు.

గురజాడ ప్రారంభించిన నవ కవితోద్యమం జానపద కవితకు సన్నిహితం. పద కవితలు పూర్వ కవిత్వంలోనూ వుండేవి. అవి పాల్కురికి సోమన పండితారాధ్య చరిత్రలో పది - పదిహేను పేర్కొనబడ్డాయి.

సుంకర సత్యనారాయణ, నాజర్, గద్దర్ వంటి వారి పాటలు, జానపద కవితలు. అవి వర్తమాన కాలంలో అన్ని వర్గాల వారినీ అలరించేవి.

**సుంకర సత్యనారాయణ :**

"బిరాన లేచి రండు తెలుగు
బిడ్డలార ఒకటిగా,
దురాగతాలు సేయు దేశ
ద్రోహి నణచి వైవగా" ॥బిరా॥

ప్రజావిరోధి ఎవ్వడైన
బ్రతుకలేడు నిశ్చయం, నిశ్చయం
ప్రజాబలాల ధాటి నాప
బ్రహ్మ తరముకాదు పో॥ ॥బిరా॥

నిరంకుశత్వ మేదియైన
నిలువలేదు జగతిపై, జగతిపై
దురాత్ములైన హిట్లరాదు
లొరిగిపోయి రుర్విపై॥ ॥బిరా॥

పరాక్రమించి ప్రతిఘటించు
ప్రజలకెదురు లేదురా, లేదురా
కిరాత ధనిక పెత్తనాని
కంత్యక్రియలు చేయరా॥ ॥బిరా॥

## భావ, అహంభావ కవిత్వాలు :

నా దేశం, నా భాష, నా మతం, నా కులం అన్న భావాలు చాల సంకుచిత మైనవి. గురజాడది వసుధైక కుటుంబ భావన. ఆయన రాసిన 'దేశభక్తి'లో అది స్పష్టంగా వ్యక్తమయింది. దేశమన్నది వొక మహావృక్షం. అది పుట్టించి, దేశంలో అభిమానాలు పుట్టించాలి.

రాయప్రోలు, విశ్వనాథ పద్యాల తీరు వేరు. ఇటువంటివే 'జనగణమన అధినాయక జయహే' "వందేమాతరం సుజలాం సుఫలాం మలయజ శీతలాం...." "మా తెలుగు తల్లికి మల్లెపూదండ...." "చెయ్యెత్తి జెయికొట్టు తెలుగోడా, గతమెంతొ ఘనకీర్తి గలవోడా.. " "సారే జహాసే అచ్ఛా హిందూ సితా హమారా...." – ఇటువంటివన్నీ జాతీయ దురహంకారాన్ని రెచ్చగొట్టే అహంభావ గీతాలు.

"....సూర్యుని వెలుతురు సోకనందాక....నరుడు భూతలిని నడుచు నందాక ...అనంత భూతలిని మన భూమి వంటి చల్లని భూమిలేదు....పాడరా నీ తెన్గు ..." అన్న రాయప్రోలు పాటకు, విశ్వనాథ మారుమోత.

"గోదావరీ పావనోదార వాఃపూరీ మఖిల భారతము మాదన్న నాడు...."

గురజాడ ప్రబోధం వట్టి గొప్పలు చెప్పుకోవద్దని, "దేశమును ప్రేమించు మన్నా" – ఎంత తియ్యని ఉపదేశం! "లోకమందలి మంచి చెడ్డలు లోకు లెరుగుదురా?" – ఎంత నిశితమైన ప్రశ్న!

## గురజాడ కవిత్వంలో వైవిధ్యం :

ఇంకోరకం కవితలు ఆయనవి 'కన్యాశుల్కం'లో 'పుట్టమూను బ్రైటటా' వంటి ఆంధ్ర - ఆంగ్ల సంగీత - కవిత్వ రచనలు గిరీశానివి. సారాకొట్టులో

హిందూస్తానీ పాట, గవరయ్య, సిద్ధాంతి నోటినుంచి మధురవాణి మీదా, పోలిసెట్టి ముక్కుమీద, పేకాట జరుగుతున్నప్పుడు చెప్పిన ఆశుకవిత్వం, దాసరి వేషంలో కరటక శాస్త్రి శిష్యుడు పాడిన తత్త్వాలు ఇవి గురజాడ జానపదుల నుంచి సేకరించినవి. కొండుభట్టీయంలో సాయిబు పాత్ర 'వేదం బోవోజీ' అని గద్దిస్తుంటే, కొండుభట్టు సాయిబును మోసం చెయ్యడానికి తెలుగు ఉర్దూ సంకర వేదం వరసలో ఆశు కవిత్వం కూడా గురజాడ కవిత్వ వైవిధ్యంలో చేర్చవలసినది.

'యూనిలిట్' అన్న ఇంగ్లీషు పత్రికలో రోణంకి అప్పల స్వామిగారు (1909-1987) రాసిన వ్యాసం సంగ్రహ రూపానికి తెలుగు అనువాదంలో తనకు తెలిసిన చాలా యూరోపియన్ భాషల్లో ఎక్కడా దేశభక్తి గురించీ, సకల స్త్రీ పురుషుల సమానత్వం గురించీ, శాంతి సమృద్ధి, సంపదల గురించీ గురజాడ చెప్పినట్టుగా ఎవరూ చెప్పలేదు. గురజాడ గంగోత్రి పాయ లివన్నీ. గురజాడ చెప్పింది రక్తరహిత విప్లవం గురించీ—సామాజిక—సాహిత్యరంగంలో.

## భవిష్యత్తులో కవిత్వం :

మనం సత్యాలని నమ్మినవన్నీ, సత్యాలు కావని మన జీవిత కాలంలోనే రుజువవుతుంటుంది. అప్పుడప్పుడు. చంద్రగోళం స్వయం ప్రకాశ మన్నది కాదని, దాని మీద రాళ్ళూ, రప్పలు, గోతులూ కంగాళీగా అంతటా వున్నాయనీ అమెరికన్ పౌరుడొకడు దానిమీదకు దిగి రాత్రిని తెచ్చి చూపేడు. సోవియట్ విజ్ఞాన శాస్త్రజ్ఞులు యంత్ర సాధనాల ద్వారా భూమికి వాటిని తెచ్చి చూపేరు.

ఇప్పుడీ వర్తమాన కాలంలో కవులు తమ ప్రేయసిని చంద్రముఖి అని సంబోధించగలరా? "చందమామరావే, జాబిల్లిరావే, కొండెక్కిరావే" - అంటూ పాడి తల్లులు తమ పిల్లల్ని లాలించగలరా? వాస్తవ స్థితి యింకోలాగా వుంటే మరి!

చందమామ స్త్రీకాదు, పురుషుడూ కాడు. ఒక కవిగారన్నట్టు అమృతము గూడు కట్టిన దొర కాడు. చంద్రుడు; ముస్లిముల దైవమూ కాడు.

పీఠికగా రాసిన యీ చిన్న వ్యాసంలో పిట్టచూపుకు అందిన వానిని, వీలయిన వాటిని కొందరిని మాత్రమే చూపడం జరిగింది. అందరినీ చూపడం సాధ్యం కాని పని - మన్నించాలి.

గురజాడ అప్పారావుగారు చనిపోయాక 80 ఏళ్ళ కాలంలో మన భాష పైని, సాహిత్యం పైని, కవిత్వం పైని పడిన ఆయన ప్రభావం అపారం. ఆయనకు ముందరా, ఆయన జీవితకాలంలోనూ, ఎన్నెన్నో మార్పులు వచ్చాయి. రాబోయే మార్పులు ఊహాతీతం.

పీఠికగా రాసిన యీ చిన్న వ్యాసంలో విపులంగా రాయడం సాధ్యంకాని పని.

సెప్టెంబరు, 21, 1995
మద్రాసు.

సెట్టి ఈశ్వరరావు

# విషయసూచిక



విశాఖపట్టణంలో గురజాడ విగ్రహం, శిల్పి : అంట్యాకుల పైడిరాజు.



విజయనగరంలో
గురజాడ
విగ్రహం
శిల్పి : ధర్మారావు

# ముత్యాల సరములు

గుత్తునా ముత్యాల సరములు
కూర్చుకొని తేటైన మాటల,
కొత్త పాతల మేలు కలయిక
క్రొమ్మెరుంగులు జిమ్మగా.

మెచ్చునంటా వీవు; నీ విక
మెచ్చకుంటే మించిపాయెను;
కొయ్య బొమ్మలె మెచ్చు కళ్ళకు
కోమలుల సౌరెక్కునా?

తూర్పు బలబల తెల్లవారెను,
తోక చుక్కయు, వేగు చుక్కయు,
ఒడయుడా వేవెల్గు కొలువుకు
వెడలి మెరసిరి మిన్ను వీధిని.

వెలుగు నీటను గ్రుంకె చుక్కలు;
చదల చీకటి కదలబారెను,
యెక్కడనొ వొక చెట్టు మాటున
నొక్క కోకిల పలుకసాగెను.

మేలుకొలుపులు కోడి కూసెను:
విరులు కన్నులు విచ్చి చూసెను;
ఉండి, ఉడిగియు, ఆకు లాడగ,
కొసరెనోయన గాలి వీచెను.

పట్టమున పదినాళులుంటిని
కార్యవశమున పోయి; యచ్చట
సంఘ సంస్కరణ ప్రవీణుల
సంగతుల మెలగి,

యిల్లు జేరితి నాటి వేకువ;
జేరి, ప్రేయసి నిదుర లేపితి;
"కంటివే" నేనంటి, "మింటను
కాము బాణం బమరియున్నది."

తెలిసి దిగ్గనలేచి, ప్రేయసి
నన్ను గానక, మిన్ను గానక
కురులు సరులను కుదురు జేయుచు
ఓరమోమిడ, బల్కెతిన్.

"ధూమకేతువు కేతువనియో
మోము చందురు డలిగి చూడడు?
కేతువా యది? వేల్పు లలనల
కేలి వెలితొగ కాంచుమా!

"అరుదుగా మిను చప్పరంబున
చొప్పు తెలియని వింత పొడమగ,
చన్న కాలపు చిన్న బుద్ధులు
బెదరి యెంచిరి కీడుగా.

"అంతె కాని రవంతయైనను
వంత నేగతి కూర్చ నేర్చునె,
నలువ నేరిమి కంతు యిది యన
నింగి తొడవయి వ్రేలుచున్.

"కవుల కల్పన కలిమి నెన్నో
వన్నె చిన్నెలు గాంచు వస్తువు
లందు వెట్టి పురాణ గాథలు
నమ్మ జెల్లునె పండితుల్.

"కన్ను కానని వస్తుతత్వము
కాంచ నేర్పరు లింగిరీజులు;
కల్లనొల్లరు; వారి విద్యల
కరచి సత్యము నరసితిన్.

"దూర బంధువు యితడు భూమికి,
దారి బోవుచు చూడవచ్చెను—
దెబ్బ దెనుబది యేండ్ల కొక తరి
నరుల కన్నుల పండువై.

"తెగులు కిరవని కతల పన్నుచు
దిగులు జెందు టదేటి కార్యము?
తలతు నే నిది సంఘ సంస్కరణ
ప్రయాణ పతాకగాన్.

"చూడు, మునుమును మేటి వారల
మాటలనియెడు మంత్ర మహిమను,
జాతి బంధములన్న గొలుసులు
జారి సంపద లుబ్బెడున్.

"యెల్ల లోకము వొక్క యిల్లై
వర్ణ భేదము లెల్లకల్లై,
వేల నెరుగని ప్రేమ బంధము
వేడుకలు కురియ.

"మతము లన్నియు మాసిపోవును.
జ్ఞాన మొక్కటి నిలిచి వెలుగును;
అంత స్వర్గ సుఖంబు లన్నవి
యవని విలసిల్లున్.

"మొన్న పట్టణమందు ప్రాజ్ఞులు
మొట్ట మొదటిది మెట్టు యిది యని,
పెట్టినా రొక విందు జాతుల
జేర్చి; వినవైతో?"

అంటినే నిట్లంత ప్రియసఖి
యేమి పలుకక యుండి యొక తరి,
పిదప కన్నుల నీరు కారుచు
పలికె నీ రీతిన్.

"వింటి, మీ పోకిళ్ళు వింటిని,
కంట నిద్దుర కానకుంటిని,
యీ చిన్న మనసును చిన్న బుచ్చుట
యెన్నికని యోచించిరో?

"తోటి కోడలు దెప్పె; పోనీ;
సాటివా రోదార్చె; పోనీ;
మాటలాడక చూచి నవ్వేడి
మగువకే మందున్.

"తోడు దొంగని అత్తగారికి
తోచెనేమో యనుచు గుందితి;
కాలగతి యని మామలెంతో
కలగ సిగ్గరినై.

"చాలునహా! మీ చాకచక్యము.
చదువు కిదె కాబోలు ఫలితము!
ఇంత యగునని పెద్ద లెరిగిన
యింగిలీషులు చెపుదురా?

"కోట పేటల నేల గలరని
కోటి విద్యలు మీకు కరిపిరి;
పొట్ట కూటికి నేర్పు విద్యలు
పుట్టకీట్లు కదల్చెనా?

"కట్టుకున్నది యేమి కానీ;
పెట్టి పొయ్యక పోతె, పోనీ;
కాంచి పెంచిన తల్లిదండ్రుల
నైన కనవలదో?"

"కలసి మెసగిన యంత మాత్రనె
కలుగబోదీ యైకమత్యము:
మాల మాదిగ కన్నె నెవతెనొ
మరులుకొన రాదో?"

అనుచు కోపము నాపజాలక
జీవితేశ్వరి సరులు నామై
చరచి చనె క్రొమ్మెరుగు చాడ్పున
మనసు వికలముగాన్.

తూర్పు బల్లున తెల్లవారెను;
తోకచుక్క యదృశ్యమాయెను
లోకమందలి మంచి చెడ్డలు
లోకు లెరుగుదురా?

("ఆంధ్ర భారతి" 1910 జూలై)

# కాసులం

మనల కీ పోరాట మిప్పుడు
దేని గూరిచి కలగె చెపుమా,
మరచితిని....నవ్వేద వదేలను?
యేమి కారణమైన పోనీ;

వినుము....ధనములు రెండు తెరగులు;
ఒకటి మట్టిని పుట్టినది; వే
రొకటి హృత్కమలంపు సౌరభ,
మదియు నిది యొక్కడను కలుగుట
యరుదు; సతులకు వేడ తగినది
యెద్దియో?

"మనసులో నీ కుండు
ధనమన నొండు కలదే పసిడి
గాక"ని. ప్రాజ్ఞులకె కనికట్టు
కనకము; చపల చిత్తల కన్ను
చెదురుట చిత్రమా। తీవలకు
తలిరుల తెరంగున, కాంచనము
సింగార మందురు లలనలకు;
కానిమ్ము; గాని, కమ్మని తావి
గ్రగమ్మెడి పుష్ప నిచయము ప్రేమె
కా? అది లేక మంకెన కెంపు
కాంతల యందమ్ము.

"ప్రేమ కొరుకుకు
తిందురా? యెట్టిదది? నా వలను
కలదో, లేదో?" యను నొక వింత
చూపును చూచెదవు—

బంగరు

మిసిమి మేనికి పసుపు నలదితి;
కురుల నలరుల నూనె నించితి;
కాటుకను మెరుగిడితి చూడ్కికి;
విడెము వింత హొరంగు గూర్చెను
వాతెరకు; పలు వరుస వెన్నెల
లలమె; దానదానను, మురువు
పెనగొనె, నేర్చి మెరసితి రూపు;
ప్రేమ పెంచక పెరుగునే?

ప్రేమ—

పెన్నిధి గాని, యింటను నేర్ప
రీ కళ, ఒజ్జలెవ్వరు లేరు—
శాస్త్రము లిందు గూరిచి తాల్చె
మౌనము-నేను నేర్చితి భాగ్య
వశమున, కవుల కృప గని, హృదయ
మెల్లను నించినాడను ప్రేమ
యను రతనాల-కొమ్మ!
తొడవులుగ నవి మేన దాల్చుట
యెటుల నంటివో? తాల్చి త దె, నా
కంట చూడుము! సతుల సొరను

కమల వనముకు పతుల ప్రేమయె
వే వెలుగు ప్రేమ కలుగక బ్రతుకు
చీకటి

నా నేర్చు కొలదిది

(ప్రేమ విద్దెకు వోనమాలివి,)
యెదను నిల్పిన, మేలు చేకురు.

మరులు ప్రేమని మది దలంచకు;
మరులు మరలును వయసు తోడనె;
మాయ, మర్మములేని నేస్తము
మగువలకు మగవారి కొక్కటె
బ్రతుకు సుకముకు రాజమార్గము.
ప్రేమ నిచ్చిన ప్రేమ వచ్చును.
ప్రేమ నిలిపిన ప్రేమ నిలుచును.
ఇంతియె.

కాసు వీసము నివ్వ నొల్లక;
కవిత పన్నితి నని తలంపకు;
కాసులివె; నీ కంఠసీమను
జేరి బంగరు వన్నె గాంచత!
మగడు వేల్పన పాత మాటది;
ప్రాణమిత్రుడ నీకు, నీ నెనరు
కలుగక యున్న, పేదను; కలిగినను
నా పదవి వేల్పుల రేని కెక్కడ?

("ఆంధ్ర భారతి" 1910 ఆగస్టు)

# కన్యక

తగటు బంగరు చీరె కట్టి
కురుల పువ్వుల సరులు జుట్టి
నుదుట కుంకుమ బొట్టు పెట్టి
సొంపు పెంపారన్;

తొగల కాంతులు కనులు పరపగ
మించు తళుకులు నగలు నెరపగ
నడక లంచకు నడలు కరపగ
కన్నె పరతెంచెన్
రాజవీథిని.

పసిడి కడవల పాలు పెరుగులు
పళ్లెరమ్ముల పళ్ళు పువ్వులు
మోము లందున మొలక నవ్వులు
చెలగ చెలికత్తెల్
వెంట నడిచిరి.

అంత పట్టపు రాజు యెదురై
కన్నె సొగసుకు కన్ను చెదరై
మరుని వాడికి గుండె బెదురై
యిట్లు తలపోసెన్.

"ఔరః చుక్కల నడుమ చందురు
నట్లు వెలిగెడు కన్నె ముందర
వన్నె కాంచిన నగరి సుందరు
లంద రొక లెక్కః

"పట్టవలెరా దీని బలిమిని
కొట్టవలెరా మరుని రాజ్యం
కట్టవలెరా గండ పెండెం
రసిక మండలిలో."

నాల నడమను నట్టి వీథిని
దుష్ట మంత్రులు తాను పెండెం
గట్టి కన్నెను చుట్టి నరపతి
పట్ట నుంకించెన్.

మట్టి వచ్చిన దైవగతి కిక
దైవమే గతి యని తలంచుక
దిట్టతనమును బూని కన్నియ
నెట్ట నిటు పలికెన్.

"ముట్టబోకుడు, దేవకార్యం
తీర్చి వచ్చెద, నీవు పట్నం
యేలు రాజువు, సెట్టి కూతర
నెటకు పోనేర్తున్."

చుట్టములు తన చుట్టు నిలవగ
భృత్య వర్గం కాచి కొలవగ
సెట్టి కరములు మోడ్చి రాజుకు
ఇట్లు వినిపించెన్.

"పట్టమేలే రాజః బలిమిని
పట్టవలెనా? నీదు సొమ్మే
కాద కన్నియ? నీవు కోరుట
కన్న మరి కలదా
వైశ్యజాతికి వన్నె?

"గాని మన్నన జేసి మమ్ముల
బంధువర్గం, కులం పెద్దల
ధర్మమన్నది అరసి కొంచెం
దారి కనబడితే,

అగ్నిసాక్షిగ కన్నె గైకొని
ఆదరించుము మమ్ము, కానుక
లందు కొమ్మెంతంత వలసిన,
మనుచు మాజాతిన్."

నవ్వి హేళన నవ్వు, నరపతి
పల్కె, "నోహో! ధర్మ మార్గం
పట్టమేలే రాచబిడ్డకు
సెట్టి కరపదమా!

"రాజు తలచిందేను ధర్మం
రాజు చెప్పిందెల్ల శాస్త్రం
రాజులకు పేరైన పద్ధతి
కాద, గాంధర్వం?

"తడవు చెయ్యక తల్లడిల్లక
నేడు రేపని గడువు పెట్టక,
నెమ్మి గోరితివేని, కన్నియ
నిమ్ము!
లేకుంటే, పొమ్ము!

"దేగ, పిట్టను పట్టి విడుచున?
కన్నె, యింటికి మరలి నడచున,
తెమ్మ కానుక లిమ్మ, నీవిటు
వచ్చినందాకన్,

కదల"; నంతట సెట్టి పలికెను,
"దేవకార్యం ముందు, ఆవల
రాచకార్యం కాద, రాజా!
శలవు నీవిస్తే-

"యింటి దైవం వీరభద్రుడి
దేవళానికి పోయి యిప్పుడె
పళ్లెరం సాగించి వత్తును,
పైని తమ చిత్తం!"

"మంచిదే, మరి నడువు, మేమును
తోడ వత్తుము, దేవళంలో
అగ్నిసాక్షిగ కన్యకను మే
మందుకొన గలము."

## 2

నాడు గుడిలో మండె గుండం
మంట మింటిని ముట్టి యాడగ,
కన్న నరపతి గుండె దిగులై
పట్టు విడ జొచ్చెన్.

భక్తి పరవశ మైన మనసున
దుర్గ నప్పుడు కొలిచి, కన్యక
ముక్తి వేడుచు వూడ్చి నగలను
శక్తి కర్పించెన్.

దుర్గ కొలనున గ్రుంకి పిమ్మట
రక్త గంధం రక్తమాల్యం
దాల్చి, గుండం చుట్టు నిలిచిన,
జనుల కిట్లనియెన్:

"అన్న లారా తండ్రులారా
ఆలకించం డొక్క విన్నప
మాలు బిడ్డల కాసు కొనుటకు
ఆశలే దొక్కొ
కులము లోపల?

"పట్టమేలే రాజు అయితే
రాజు నేలే దైవ ముండడొ?
పరువు నిలపను పౌరుషము మీ
కేల కలగదొకో?

"విద్య నేర్చినవాడు విప్రుడు
వీర్య ముండిన వాడు క్షత్రియు
డన్న పెద్దల ధర్మ పద్ధతి
మరచి, పదవులకై

"ఆశ చేయక, కాసు వీసం
కలిగి వుంటే చాలు ననుకొని,
వీర్య మెరుగక, విద్య నేర్చక
బుద్ధి మాలినచో,

"కలగవా యిక్కట్లు? మేల్కొని,
బుద్ధి బలమును బాహు బలమును
పెంచి, దైవము నందు భారం
వుంచి, రాజులలో

"రాజులై మను డయ్యః" ఇట్లని
కన్య నరపతి కప్పుడెదురై
నాలు గడుగులు నడిచి ముందుకు
పలికె నీ రీతిన్.

"పట్టపగలే, వీధిని
పట్టబోరే జార చోరులు,
పట్టదలచితి వింక నీవొక
పట్టమేలే రాజువటః

"కందకావర మెక్కి నీవీ
దుండగము తలపెట్టినందుకు
వుండడా వొక దైవమంటూ,
వుండి వూరొ్కనునా?

"కులం పెద్దలు కూడి రదుగోః
అగ్నిసాక్షికి అగ్ని అదుగోః
కన్ను కోరిన కన్నె యిదుగోః
జాల మేలొకో్క?

"పట్టమేలే రాజువై తే
పట్టు నన్నిపు" డనుచు కన్యక
చుట్టి ముట్టిన మంట లోనికి
మట్టి తా జనియెన్ః

పట్టమేలే రాజు గర్వం
మట్టి గలిసెను, కోట పేటలు
ఘూలి, నక్కల కాటపట్టయి
అమరె,

యెక్కడైతే కన్య, మానం
కాచుకొనుటకు మంట గలిసెనో
అక్కడొక్కటి లేచె సౌధము
ఆకసము పొడుగె.

పట్టమేలే రాజు పోయెను,
మట్టి కలిసెను కోట పేటలు,
పదం పద్యం పట్టి నిలిచెను
కిరులపకిరుల్.

('ఆంధ్ర భారతి' **1912** అక్టోబరు,
'శశిలేఖ' **1912** నవంబరు.)

# లవణరాజు కల

నిండు కొలువున లవణుడను రా
జుండె, జాలికు డొకడు దరి జని,
"దండి నృప! యొక గండు గారడి
కలదు కను" మనియెన్.

అల్ల పింఛము నెత్తి నంతనె
వెల్ల గుఱ్ఱం బొకటి యంచల
పల్లటిల్లస నాడయు నుల్లము
కొల్లగొని వచ్చెన్.

వచ్చి నిలిచిన వారువంబును
యచ్చెరువు పై కొన్న చూపున
మచ్చ మేరలు గనక చూసెడి
నృపుని కత డనియెన్.

"ఉత్తమాశ్వం బిది నరేశ్వర!
చిత్ర గతులను సత్వ జవముల
చిత్త మలరించేని, జను మిక
మనసు గల చోట్లన్."

చూపుదక్కగ చేష్ట లుడిగెను
చూపరులు వెరగంద నృపునకు;
యేపు చెడి, యొక కొంత తడవున
కెరిగి, నలుగడలన్

కలయ జూసెను కల్ల నిజములు
కలక జెందిన మనసు లోపల
మెల్ల మెల్లన పూర్వ జ్ఞానం
బల్లుకొని పొడమ.

"యేడి జాలకు డేది యశ్వం
బేడు లెన్నో గడిచె" నృపు,
"డేడు నిమిషము లేవి ప్రభువా!"
యనిరి తన భృత్యుల్.

కలదు లేదను రెండు భ్రాంతుల
కలయ గూర్చుకు బుద్ధి బలమున
కాల మహిమకు వెరగు జెందుచు
లవణు డిట్లనియెన్.

"ఏడు నిముషము లేడు లాయెనొ?
యేడు నిముషము లందు యిమిడెనొ
యేడు లెన్నో? యింత లంతలు
చింతచేయు నాకో!

యెక్కెనట వొక మాయ గుఱ్ఱం
బొక్క నరపతి మనసు నిలవక;
యెక్కినంతనె పరవశంబై
యెగసె నది యెటకో!

కన్ను మిన్నును కనని జవమున
కాననంబులు గడచి యెన్నో,
యెన్న జీవం బొక్క టేనియు
లేని మరుభూమిన్

మట్టి చనె, సంస్కృతిని జీవం
బట్టు, యిరులును మరులు వేళకు
తుట్టతుద కొక గున్న యడివిని
బట్టి, గమనంబున్

మందగించిన, మానవేంద్రుం
డందుకొనె నొక కొమ్మ నల్లుకు
క్రింద వ్రేలెడి తీవ; గుఱ్ఱము
ముందువలె పరచెన్.

అడుగు పుడమిని తగిలి నంతనె,
బడలి యుంటను నిదుర పాలై
ఒడలు తెలియక వ్రాలి నరపతి
చాగె మృతునట్లన్.

పిదప జన్మాంతరము తెరగున
నిదుర జారిన వేళ, కన్నుల
యెదుట వెలసెను వింత లోకము
సంజ కెంజాయన్.

వెలుగు నీడలు కనుల కింపై
మెలగి చెలగెడు నాకసంబున
వ్రేలు మబ్బుల యంచు లంటను
రగిలె రత్న రుచుల్.

పారె పశులు పొంజు పొంజుల;
జీరె కోయిల లొకటి వొకటిని;
ధూరి గూడుల బాసలాడెను
పిట్ట లెల్లెడలన్.

గగన రాజ్యము గ్రమ్మ వేడుక
మగటిమిని తన కళలు గూర్చుచు,
పగలు వెన్నున దన్ని సోముడు
పైనమై వెడలెన్.

తాడి వనములు తూర్పు కొండను
గొడుగు లెత్తెను; చామరంబులు
నడిపె జీలుగు, లుడు గణంబులు
దవ్వులను నిలిచెన్.

చల్ల గాలులు సాగి యలలుగ
జల్లుజల్లున రాల్చె పూవుల;
ఉల్ల మలరెను; ఆక లొక్కటె
బడబ వలె నడ రెన్.

అంత చెవులకు దవ్వు దవ్వుల
వింత గానం బొకటి సోకెను;
సోకి నంతనె పూర్వ వాసన
పిలిచి నట్లాయెన్.

మరిచె నాకలి; మరలె నిడుములు;
పరవశుండై నృపతి, గానము
దరియ, గాంచెను శ్యామలాంగిని
నొక్క జవ్వనినిన్.

అర మొగిడ్చిన కన్నుగవతో
చెదరి యాడెడి ముంగురులతో,
బెదురు యెరగని బింక మొప్పిన
బెడగు నడకలతో.

కూటి కడవను బుజముపై నిడు
వాట మది యొక మురువు గులకగ
పాట పాడెను, పాటలాధరి
చెట్లు చామలకై

పాట పాడెను, చెట్లు చామలు
కోటి చెవులను గ్రోలి యలరగ;
తాటి వనమున సాగి చంద్రుడు
తాను చెవి యొగ్గన్.

ఎవని గూరిచి పాట పాడెనొ?
యెవని నామము ధన్యమాయెనొ?
లవణుడను మాటొకటి నా చెవి
తాకినట్లయ్యెన్.

మంచి వలె నిది మాయ మగునని
యెంచి, యించుక సంశయించక
కించులన్నియు తొలగి వెంబడి
వేడి యిట్లంటిన్.

"వినుము, కిన్నర! నీకు దైవం
బన్ని శుభములు - గూర్చు గావుత!
నిన్న నుండియు నన్న మెరుగని
యాక లొక వంకన్.

"అంతకన్నను అధికతర మొక
వింత యాకలి మనసు గ్రాచెను;
యింత అంతని చెప్ప నేరక
యిట్లు వెంటడితిన్"

అనగ కన్నియ, తిరిగి మెల్లన
నన్ను కన్నులు విచ్చి చూసెను;
పూర్ణ బ్రహ్మాండాది రాజ్యము
పూని నట్లయ్యెన్.

చూసి, కన్నులు డించి, మది తల
పోసి, మిన్నక తోవ సాగెను,
బాసె బింకము బెడగు నడకల;
ముగిసె గానంబున్.

పండు వెన్నెల కుముద వనిపై
నిండు గమ్మిన నీడ కైవడి
నిండె మోమున చింత యొక్కటి,
మరల నేనంటిన్.

"అన్న మిడు టాకొన్న వారల
కెన్న సుకృతతమం బటంచును
మున్ను పెద్దలు బల్కిరది నీ
వెరుగ కుండుదువే?

"భృత్యునైతిని నీదు మూర్తికి;
భృత్యునౌదును నీకు సుందరి!
మృత్యు ముఖమున నున్న భటునకు
నన్న మీవలదో?

"చిన్న బ్రతుకుల కొలిచి కుడిచిన
తెన్ను మనసుకు కొంత తోచెడి;
నిన్న యన్నదె నేడు రేపులు
అన్యు నెట్లగుదున్?

"మౌన మూనిన, మరల గలనని
మది దలంపకు" మంటి; కన్నియ,
గమన మించుక మందగించి
శిరంబు వంచి యనెన్.

వన్నె మీరిన మేని పసతో
కన్ను మణగెడి రత్న రుచితో,
"నన్ను తెలియక నాస చేసెద
వయ్యో! మాలిత నేన్.

"అయ్య కోసము కూడు కొందును,
ఇయ్యలే నను మాట, హృదయము
వ్రయ్య చేసెడు; నాదు భాగ్యము
కెవరి నేమందున్?"

## 3

అన్న పలుకు విసంపు భల్లము
కన్నవాడయి మనసు దూసెను!
కన్నె కన్నుల నీరు గమ్మట కాంచి
ఖిన్నుడనై.

కొన్ని నిమిషము లెన్ని యెన్నో
కన్న విన్నవి ధర్మముల నే
నెన్నుకొని, వొక పరమ ధర్మము
నపుడు గనుగొంటిన్.

మలిన వృత్తులు మాలవారని
కులము వేర్చిన బలియు రొక దే
శమున కొందరి వెలికి దోసిరి
మలినమే, మాల

కులము లేదట వొక్క వేటున
పసరముల హింసించు వారికి;
కులము కలదట నరుల వ్రేచెడి
క్రూర కర్ములకున్.

మలిన దేహుల మాల లనుచును,
మలిన చిత్తుల కధిక కులముల
నెల వొసంగిన వర్ణ ధర్మ మ
ధర్మ ధర్మంబే!

అనెడు నిశ్చయ మాత్మ దోపగ
"వినుము, కన్నియ!" యంటి యెదురై,
"జనులు తెలియక పలుకు మాటకు
జనదు వగవంగన్."

"మంచి చెడ్డలు మనుజు లందున,
యెంచి చూడగ, రెండె కులములు,
మంచి యన్నది, మాలయైతే,
మాలనే అగుదున్.

"తెలివి యొలికెడి తేట కన్నులు
మురువు గులికెడి ముద్దు మోమును
వేల్పు చేడియలైన నేరని
గాన మాధురియున్."

"చిత్తరవు లందైన గనని ప
విత్ర రూపపు సౌష్టవంబును,
ఉత్తమోత్తమ జాతి లక్షణ
యుక్తి సంపదయున్."

"మాలయను వారున్న, వారల
మందబుద్ధికి వగవ వలె; తన
యందు లేని కొరంత కలదని
వగవగానేలా?"

"నమ్మ నేనను మాట తెరవ? భ
యమ్ము వాయుము; కూటి నిడి చే
కొమ్మ నా హృదయంపు రాజ్యము
నిస్సపత్న్యముగాన్."

వినియె వ్రీడా విస్మయంబులు
ఆననంబున పొడమి పొరగ
కనుల నెత్తుచు, డించుచును నను
కాంత యిటు బలికెన్.

"తండ్రి కోసము తెచ్చు కూటిని
—తిండికై యొరు కెట్టు లిత్తును?
పెండ్లియాడిన—పెనిమిటొకనికి
— పెట్ట ధర్మంబౌ?

"తడవు ఆయెను; తల్లడిల్లుచు
తండ్రి నాకై యెదురు చూసును"
అనుచు నన్ను తొలంగు భావము
అతివ అగుపరచన్.

కరము బట్టి యురంబు యురమున
జేర్చి, ముద్దిడి కురులు దువ్వితి:
తాళ వనమును వెడలి చంద్రుడు
పక్కనను నవ్వెన్.

"ఆడబోయిన తీర్థ మెదురై
వేడబోయిన వరము వచ్చెను;
పెండ్లి యాడెద చంద్రు సాక్షిగ
పెట్టు కూ" దంటిన్.

మున్ను వేల్పులు వెన్న చేతను
గొన్న యమృతము కన్న రుచులను
చెన్ను మీరెను కూడు, కన్నియ
చేత నిడినంతన్.

## 4

"వచ్చితివ యల్లుండః నీకై
వేచి యుంటిని యింత కాలము;
యిచ్చితిని, చేకొమ్ము కూతును
ప్రాణ మది నాకున్.

"వచ్చితిమి యెట నుండొ, అటబో
నిచ్చమెందై యుండు మనమున;
పసిడి గొలుసులు, బిడ్డ నాకై
పట్టి నన్నుంచెన్."

"ఇహము లోపలి మంచి యంతయు
యిమిడి యున్నది దీని ఆత్మను;
ముక్తి కాంతై తుదకు నీకిది
ముందు గతి చూపున్.

"కరపినాడను పరము మరవక
యిహము నందున మనెడు మర్మము;
కోటి తపముల పుణ్యఫల మిది
కొమ్ము నీకిస్తిన్

"మాలనైనను మలిన వృత్తులు
మానుకుంటిని గురువు దయచే;
పొలము లోపల పశుల మేపుచు
పొట్ట పోషింతున్.

"మలిన వృత్తులు మాన్పి, మాలల
వలస తెచ్చితి యీ వనాంతము;
పల్లె కలదిట; ప్రాజ్ఞు లందలి
ప్రజలు మా వారల్

"పాడి పంటలు గలవు తామర
తంపరలు మా పశుల మందలు;
జంతు హింసను చేయ నొల్లము;
భూతదయ మతము."

"కాని మనుజుని బుద్ధి లోపల
కలవు, తన మే లొరులు కీడును
తలచు వృత్తులు; కానబోయిన
కలచు నెవ్వారిన్."

"మాన్పగలిగితి కత్తి కోతలు;
మాన్ప వశమే; మాట కోతలు?
కత్తి చంపును; మాట వాతలు
మాన వేనాడున్."

"నాటునను గలయట్టి యిడుములు
కాటి యందును కలవు; ఓరిమి
యేటికైనను మందు; కలిగిన
కలుగు సౌఖ్యంబుల్."

"యేలుకొను డొండొరుల; సిరులకు
మిట్టి పడకుడు; కీడు మూడిన
నాడు కుంగకు; డొరుల మేలుకు
పాటుపడు డెపుడున్."

అనుచు పలికెను వేద వాక్కులు
మమ్ము చేతులు బట్టి కన్నియ
తండ్రి; తొల్లిటి ఋషి యితండని
తోచ చిత్తమునన్.

పండు గెడ్డము; నిండు కన్నుల
నిండ శాంత రసంబు; పలుకుల
కదలి గాంభీర్యంబు, యొదలిని
దివ్య తేజంబున్.

కలిగి కూచునె రాజ ఋషి వలె
రావి కిందను రచ్చ శిలపై
కొమ్మలను జొరి చంద్ర కాంతులు
మేన చెదరంగన్.

అంత నుండియు కొన్ని పంటలు
కాంతతో నట స్వర్గ సౌఖ్యము
లొంది, మంటిని; చక్రవర్తుల
కొమరులను కంటిన్.

చిత్తమా కొమరులను తగులుట
కొత్త శృంఖల యంచు మామని
వృత్తిమార్గము పట్టి, దేహము
వాసె యోగమునన్.

పల్లె లోపల ధొమ్ము లాటలు
అల్లుకొనె, ఆ నాట నుండియు
యెల్లవారలు పెద్ద లగుటకు
యెంచి చూడంగన్.

సన్నగిల్లెను సాగు పొలమున,
వున్నదెల్లను తిన్న పిమ్మట
తినిరి పెంచిన పశుల చంపుకు;
అవియు కడతేరన్.

చెల్లచెదురై పరచి రందరు
యెల్ల దిశలను: పరచు ముందర
కొల్లగొని రేనున్న పొలమును
షండి మేముండన్.

తెల్లవారిన నుండి మేమును
పిల్లలము పడ్డట్టి పాటులు
ఝల్లుమనియెడు నొడలు, తలచిన
చాల, చెప్పంగన్.

అడవి యందలి కాయ కసురులు
కుడవ నేరక బడలె బిడ్డలు,
అడవి ద్రిమ్మరి కడకు ప్రాణము
చేరి నే నుంటిన్.

ప్రాణసఖి నను పిలిచి యప్పుడు
పలికె స్మితముఖియై "వినుండిక
చేయు కార్యము లేదు, చెల్లెను;
ముందు గనవలయున్."

"కధరు జేరితి మీ భవంబున;
తడవులేదిక; మనసు తిప్పకు
గడగవలె రాబోవు భవమున
జ్ఞాన సంపదకై."

"కష్ట సుఖముల తీరు లెన్న న
దృష్టములు - మన సత్యవర్తన
కాచు గావుత, కావ గలిగిన
కన్న పసివాండ్రన్."

"చింత యుడుగుడు-చితిని జొత్తము
యింత కన్నను భాగ్యమున్నదె;
అంతమున మతి యెట్టులుండునొ
అట్టి గతి గల్గున్."

"కలుగు భవములు కూడ నీతో
కలిసి గడుపుచు ముక్తి జెందెద-
కలదె నీ ప్రణయాతిరేకము
కన్న సద్గతియున్?"

అనుడు, చింతలు వాసి, కైకై
జేర్చి జొచ్చితి మపుడు చితి.

*          *

# 5

పలికె నిట్టుల పలు విషాద స
మాకులేక్షణు డగుచు లవణుడు,
"కలగవల దిది మాయ సర్వం"
బనిరి శాస్త్రజ్ఞుల్.

లవణు డనియెను, బొమలు ముడివడ,
"కలగ వలదట! కల్ల యిది యట!
కలిగి నది లేదన్న యంతనె
తొలగునట వెతల్!"

"పుస్తకంబులలోని మాటలు
విస్తరించుచు, ననుభవమ్ముల
తత్వమెరగక, శుకము లగుదురు
వొట్టి శాస్త్రజ్ఞుల్!

"యెప్పటికి అనుభూత మెద్దియొ
అప్పటికి యది నిక్కువంబే-
యెప్పుడో లోకంబు కల్లగు;
ననుట యిపుడెట్లో?"

"చిత్తమందున కీలితములై
నిత్య ఖేదము నిచ్చు తలపుల
నెత్తి వైచును-లేరె! హా! యిది
చెప్పగల ప్రాజ్ఞుల్?

"యెక్కడిది ఆ మాయ దేశం
బెక్కడుందురు నాదు బిడ్డలు?
ఒక్కరైనను జూపలేరే
నాదు ప్రాణ సఖిన్?"

నృపుడు యిట్లని శోక భార
మ్మాపుకొన శక్యమ్ముగా కిరు
కేల కన్నులు మూసి, చింతా
మగ్నుడై యుండెన్.

అంత దుర్గ ద్వార సీమను
వింత కలకల వినగ నయ్యెను;
చెంత ద్వారకు డేగి నృపునకు
తెల్పె నొక "మునియన్."

"వారువముపై నొక్క కన్నియ;
వచ్చి నిలిచిరి ద్వార సీమను."
"చెచ్చెరను తెమ్మ"నియె నరపతి
నోట మాటుండన్.

జొచ్చె నాస్థానాంగణం బపు
డప్సరాకృతి వొక్క కన్నియ;
అచ్చ వర్ణపు టశ్వరాజం
బొక్క తాపసుడున్.

పలికె తాపసు "దతుల సౌఖ్యం
బధిప! నీ కౌగాక: యవనుడు,
సింధు దేశాధిపుడు, పితృసఖు
డంపె కానుకగా."

"తనదు గాదిలి పట్టి, యీ యమ
వినయ విద్యా సద్గుణాన్విత:
కోరె నీ నెయ్యంబు; నీ గుణ
సంపదకు నలరెన్."

"పంపె నీకీ యశ్వరాజం
బెందు లే దిద్దానికీ" దనె-
చెవిని మాటలు సోకి సోకక
లవణు డక్కన్నెం

జూచె, స్మయ హర్షాతిరేకము
లాత్మ పెనగొన; డాసి, చేకొని
"వచ్చితివ, నా ప్రాణ సఖి" యని
గద్దియను జేర్చున్.

(ఆంధ్రభారతి మే 1911)

# డామన్, పితియస్

వన్నె కెక్కిరి డమను పితియసు
లన్న యవనులు ముజ్జగంబుల
మున్ను: వారల స్నేహ సంపద
నెన్న సుకృతంబౌ.

ఒక్క నాడా సీమ జనపతి
యక్కజంబగు కోప భరమున
"ప్రక్కలించుము డమను శిర"మని
పలికె తలవరితోన్.

చెక్కు చెదరక నిలిచి డమనుడు
"నిక్కమే కద చావు నరునకు ?
యెక్క డెప్పుడు, యెటుల గూడిన
నొక్కటే కాదా ?

"ప్రమందు టన్నది బొందె మార్చుట,
ముందు భవమున కలుగు విభవము
నందిజేయుటె కాదె, యేలిక !
దండ మను మిషను !"

"కాని యింటికి పోయి యొక తరి
కనుల జూచెద నాలు బిడ్డల;
పనులు తీర్చుకు మరలి వత్తును
ధ్యానతిం" దనియెన్.

వింత పలుకును విస్మితుండై,
కొంత కరకరి తీరి నరపతి.
"యింత యిట్టుల మిడునె విద్య"ను
చింత చిగురెత్తన్.

అనియె నరపతి "యటులె కానిమ్మ
వని కొంచము విపుల మందురు;
తనువు దాచను తగిన చోటులు
కలవు యెటు జనినన్.

"మించు చతురత మాట విరుపున
యెంచి నాడవు చెడ్డ మంచని;
పంచప్రాణము లందు ప్రేముడి
పరచునే? చెపుమా?

"ఆలు బిడ్డల చూతు నంటివి,
ఆలకించిన వారి శోకము,
తొలగు విద్యలు; తొలగు ధైర్యము
తొలగు నీతైనన్.

"కాన నీకై తనువు నోడెడి
వాని నొక్కని జూపి చననగు;
మానవేశుని యాన తప్పిన
మాయదే జగము?"

లేచి పలికెను పితియ నప్పుడు,
"రాచ సింగమ! ఒడలి కొడ లిదె!
వేచి యుంటిని బ్రతుకు ఫలముకు,
ధొరికె నీ నాటన్.

"ఐన, చనుమ" నె, నవని పతి, డా
మనుడు కొంచము తలచి, యిట్లను,
పనుపు భటులను పనికి, యిప్పుడె
పోవ నే నొల్లన్.

"వొకటి తలచును నరుడు మది; వే
రొకటి తలచును బ్రహ్మ, వినమే?
పోక రాకల నడుమ నడ్డము
లెన్ని తలపడునో!"

"పొమ్ము, పొమ్మ"నె, రేడు, "పొమ్మిట
రమ్ము, యీ నెల నిండు నంతకు;
లెమ్ము, చాలదె యదను పో, రా.
నడ్డు గడ్డయినన్."

## 2

కడలి నడుమను కలదు సేమా
సనెడి ద్వీపము కవుల పుట్టిలు;
వాడి లేదట యినుని వేడికి
సీతు వలికైనన్.

ఋతువు కొక్కొక వింత రూపం
బతుల శోభా భాజనంబై
మతుల కొల్లల నాడు, స్వర్గం
బేమొ యా సీమ?

అందు నుండొక కొండ కోనను
సుందరంబగు భవన రాజము;
విందు కనులకు కదలి యెదురై
లీల లోలాడన్.

పక్షముల నారింజ, ఆలివు
వృక్ష షండము లుప్పతిల్లును;
ద్రాక్ష పందిరు లింటి పంటలు
సొంపు పచరింపన్.

నవ్వులకు సెనరులకు నిల్లయి
నివ్వటిల్లెను భవన రాజము;
పువ్వులెత్తెను దాన నిలిచిన
మొండు మనసైనన్.

తదియ చంద్రుం డబ్ధి సోకెను;
చదల విడబడి, యిరులు ప్రాకెను;
అదను కాంచిన రిక్కమూకలు
అంతటను ప్రబలెన్.

చారు తరముగ పసిడి పమిదల
బారు తీరి వెలింగె జోతులు;
వారి యంత్రము తళుకు ముత్తెపు
సరులు విరజిమ్మెన్

అలరు జిగురుల తోరణావళి
యలమి చుట్టెను జిలుగు కంబము
లుల్ల ఘలరగ పాటలు
పుమ్మరయి సెలగెన్.

ఘుమ్ము, ఘుమ్మని కమ్మతావులు
గ్రమ్మె ధూపము లాసవమ్ముల
దమ్ము రేగెను నాటి పండువ
నిండు వేడుకతోన్.

చుట్టలును, మిత్రులును, భ్రాతలు
చుట్టు మూగుచు డమను నడిగిరి
"యెట్టి వింతలు తెచ్చినాడవు
కలదు వేడ్క, గనన్?"

పలికెడామను "యిలను ద్రిమ్మరి
పలు తెరంగుల జనుల గాంచితి,
తెలియ నేర్చితి మర్మ మెల్లను
వారి విద్యలలో?"

"యెరుగ రాదని తొల్లి విబుధులు
మరుగు పరచిన మంతనంబుల
తిరుగుడులు మరలించి తీసితి
రాళ రప్పలలోన్."

"వింత నొక్కొక దాని కని, ముసు
యింత కెక్కుడు లేద నుంటిని;
వింత లన్నిటి వమ్ము జేసెడి
వింత వినుడింకన్."

"ఒకటె" ఆయెను రెండు మూడులు
"ఒకటె" ఆయెను కోటి సంఖ్యలు;
పెక్కు లొకటిగ జూచువాడే
ప్రాజ్ఞుడన వినమే?"

"నేను తానను భేద బుద్ధిని
రేని కాగ్రహ మొదవి డామను
కాని వాడని తలచి ప్రాణము
గోలు పొమ్మనియెన్."

"ఒక్క వింతిది - పిరికి డామను
వొకటి వొకటి సమము కద ? వే
రొకడు నాకయి ప్రాణమిచ్చిన
చాలదా యనియన్."

"వింత రెండవ దిద్ది - నృపుడును.
చింత వాపుచు వల్లె యనియె, న
నంతరము నే నిటకు వచ్చితి
వింత కనగోరి -"

"కాన, మీరల నెవ్వ డిప్పుడు,
తాను, నేనను బుద్ధి తలపక
తనువు నాకై విడుచు వాడ"న
పలుక డొకడైనన్."

"చింతవంతలు చిత్రితమలై
అంతకానగ నయ్యె మోముల
"వింత యిదె!" యని పలికె డామను
వికసితాననుడై."

ఆట పాటలు అణగె నంతట;
మాటు మణిగెను భవన రాజము;
చాటు మాటున బార జొచ్చిరి
సఖులు చుట్టములున్.

"కల్ల జెప్పితి!" ననియె డామను
"యెల్లరెప్పటి యట్ల నలరుం
డుల్లములు!" వారపుడు "కొనుమివె
ప్రాణముల" నన్నన్.

పంజరమ్ముల నున్న పిట్టలు
మంజులారణ్యములు మరచెను;
శింజితములౌ కాలి గొలుసులు
శిక్షయని మరచెన్.

"దారిపోయే వారికొక్కటి
కారవాసర* కల్పనాయెను;
దారి కాదిది దరి యటంచును
తలచుటొక వింత!"

అనుచు, డామను డాసవమ్ముల
నాని పాదదొడంగి మించెను;
కాని పండువ నందు కొండొక
కలక కన నయ్యెన్.

## 3

యెల్లి పున్న మనంగ పితయసు
యిల్లు నందొక విందు మిత్రుల
కెల్ల నాయెను, పితియసప్పుడు
పల్కె నీ పగిదిన్.

"తెలియు వాడన నొక్కడే భువి;
తెలుపు వాడన నొక్కడే భువి;
పలు తెరంగుల సద్గుణాళికి
పట్టు పక్కండే."

* Caravannsary మజలీ సత్రం

"కనియు, నేర్చుట, వాని కడనే;
వినియు నేర్చుట, వాని వలనే;
అనగవలెనా, అతడు దామను
డన్న మాటొకటి?"

"లోకమం దభిమాన మెంచియొ,
నాకు యశ మొనగూర్చ నెంచియొ,
నాక పతి, నా మిత్రు దామను
రాక నడ్డెడొకొ!"

"బ్రతికి, చచ్చియు ప్రజల కెవ్వడు
ప్రీతి గూర్చునొ, వాడె ధన్యుడు;
బ్రతికి దామను ప్రజల నేలును;
చచ్చి, నేనొకడన్."

"ప్రమందుటన్నది బొంది మార్చుట;
ముందు భవమున కల్గు విభవము
నంద, ప్రాజ్ఞుడు వగవ జెల్లునె
చెప్పుడీ" యనియెన్.

"చదివి చెడితివి చాలు" ననె నొక
"డొదవె యశమ"ని బలికె నొక్కం
"డదనునకు దామనుడు రాడా"
యనియె నొక్కరుడున్.

అంత పితియసు కాంత పలికెను
కొంత గద్గదికంబు తోపగ,
"ఇంత వరకును ధైర్యమూనితి
మాట నమ్మికచే."

"వచ్చువాడయితేను డమనుడు
వచ్చు నింతకె; చావు కోసము
యిచ్చగించుచు తానె వచ్చునె
పిచ్చి వాడైనన్?"

"వత్తునన్నను, వారి వారలు
మొత్తమై తా మడ్డుపడరే?
పొత్తులన్నవి సంపదలకే;
ఆపదల కగునే!"

"వాని ననుటే వింత? పతి తన
చాన నెంచక, బలగమెంచక
తనువు మిత్రున కోడు టన్నది
తగవ? యది చెపుడా!"

"కష్ట సుఖముల కలసి కుడుచుచు,
గోష్ఠి ప్రాణంబంచు నెంచుచు
ఇష్టవర్తన నున్న చానను
బాయుటొక మహిమా?"

"విందు, నీల్గుట నిక్కమౌటను
యెందు యెప్పుడదైన నొకటని;
యెందరో కల రనెడు వారల
లేరు చను వారల్."

"చదువు వారికి వెఱ్ఱి భ్రాంతులు
మెదడు కెక్కిన పాయ వందురు;
అదును లేదే దేనికైనను
అంద రెరుగనిదే?"

"పండ గలదని కాయ కుడుతురె ?
తిండి యెల్లిది నేడు తిందురె ?
అండ మందున చిలుక కలదని
అరచి జీరెదరే ?"

"బతక వలసిన కాల ముండగ
బతుక నొల్లమి కంటె పుట్టునె
బతుకు దునిమిన బతుకు భారము
పాయదే చెపుడా !"

"అది యటుండగ దమనుపై పగ
మది దలంచిన మానవేశుడు
బదులుగా గొనె పాప మెరుగని
ప్రాణి నేలనొకో ?"

"నరుని చావే కాంక్ష్య మేనియు
నరపతికి నరులెంద రనుదిన
మరుగు వారలు యముని పురమున
కంత తనియడొకో ?"

"తప్పు నొక యెడ దండ మొక యెడ;
నొప్పెయని; నరపతికి దోచిన
నప్పగించెద నాదు ప్రాణము
దమను క"న్నంతన్.

నీడ వెలువడి నిలిచె ముందట
వేడ్క మోమున వెల్లివిరియగ
"వీడె దమనుం" డంచు నందరు
విస్మయము చెందన్.

ఆ మహామతి; అంత వేరొక
యమిత విక్రమ ముడతని కెదురై
"దమన; బతుకుము బతుకు" మనె;
"రేడ" నిరి పలువురటన్.

పలికె నరపతి "మిత్ర భావము
నలుపు డిక నీ సఖుడు నీవును!
అలఘు రాజ్యము ప్రేమ సంపద
కలతి యని దలతున్:"

"విద్య లందలి మాయ మర్మము
దిద్ది చెప్పిందబల యొక్కతె;
విద్య లెరుగని ప్రేమ భరమును
వింతగా చూపెన్."

"వినగ తగినది వింటి నిచ్చట
కనగ తగినది కాంచినాడను
మనుజు లిద్దరు మగువ యొక్కతె
మాన్యు లీ జగతిన్."

('ఆంధ్రభారతి' 1910 సెప్టెంబరు)

# పూర్ణమ్మ

మేలిమి బంగరు మెలతల్లారా!
కలువల కన్నుల కన్నెల్లారా!
తల్లులగన్నా పిల్లల్లారా!
విన్నారమ్మా యీ కథను ?

ఆటలు పాటల పేటికలారా!
కమ్మని మాటల కొమ్మల్లారా!
అమ్మలగన్న అమ్మల్లారా!
విన్నారమ్మా మీరీ కథను ?

కొండల నడుమను కోనొకటున్నది!
కోనకి నడుమా కొలనొకటుంది!
కొలని గట్టునా కోవెల లోపల
వెలసెను బంగరు దుర్గమ్మ.

పూజారింటను పుట్టెను* చిన్నది
పుత్తడి బొమ్మా పూర్ణమ్మా,
అన్నల తమ్ముల కనుగై దుర్గకు
పూజలు పువ్వులు కోసేది.

---

*పుట్టిన - అని పాఠాంతరం

ఏయే వేళల పూసే పువ్వుల
ఆయా వేళల అందించి
బంగరు దుర్గను భక్తితొ కొలిచెను
పుత్తడి బొమ్మా పూర్ణమ్మ.

ఏయే ఋతువుల పండే పళ్లను
ఆయా ఋతువుల అందించి
బంగరు దుర్గను భక్తితొ కొలిచెను
పుత్తడి బొమ్మా పూర్ణమ్మ.

పళ్లను మీరిన తీపుల నడలును
పువ్వుల మీరిన పోడుములున్
అంగము లందున అమరెను పూర్ణకు
సౌరులు మించెను నానాటన్.

కాసుకు లోనై తల్లీ తండ్రీ
నెనరూ న్యాయం విడనాడి
పుత్తడి బొమ్మను పూర్ణమ్మను వొక
ముదుసలి మొగుడుకు ముడి వేస్రీ.

ఆమని రాగా దుర్గ కొలనులో
కలకల నవ్వేను తామరలు
ఆమని రాగా దుర్గ వనములో;
కిలకిల పలికెను కీరములు.

*ముద్దు నగవులూ మురిపెంబు మరి
**పెనిమిటి గాంచిన నిమిషమున
బాసెను కన్నియ ముఖ కమలమ్మున
కన్నుల గ్రమ్మెను కన్నీరు.

---

* ముద్దు నవ్వులూ మురిపెములూ మరి - అని వ్రాత ప్రతి.
** పెనిమిటిఁ జూచిన,

ఆటల పాటల తోటి కన్నియలు
మొగుడు తాత* యని కేలించ.
ఆటల పాటల కలియక పూర్ణమ
దుర్గను చేరీ దుక్కించె

కొన్నాళ్ళకు పతి కొనిపోవచ్చెను
పుత్రడి బొమ్మను పూర్ణమను;
చీరెలు సొమ్ములు చాలగ దెచ్చెను
పుత్రడి బొమ్మకు పూర్ణమకు.

పసుపు రాసిరి బంగరు మేనికి
జలకము లాడెను పూర్ణమ్మ;
వదినెలు పూర్ణకు పరిపరి విధముల
నేర్పులు మెరసీ కై చేస్రీ.

పెద్దల కప్పుడు మొక్కెను పూర్ణమ
తల్లీ తండ్రీ దీవించ్రీ;
దీవన వింటూ పక్కన నవ్వెను
పుత్రడి బొమ్మా పూర్ణమ్మ!

చిన్నల నందర కౌగిట చేర్చుకు
కంటను బెట్టెను కన్నీరూ!
అన్నల తమ్ముల నప్పుడు పలికెను
పుత్రడి బొమ్మా పూర్ణమ్మా.

"అన్నల్లారా తమ్ముల్లారా!
అమ్మను అయ్యను కానండీ
బంగరు దుర్గను భక్తితొ కొలవం
డమ్మలకమ్మా దుర్గమ్మ.

* అని

"ఆయా వేళల పూసే పువ్వుల
ఆయా ఋతువుల పళ్ళన్నీ,
భక్తిని గోసి* శక్తికి యివ్వం
డమ్మల కమ్మా దుర్గమ్మ.

నలుగురు కూచుని నవ్వే వేళల
నా పేరొక తరి తలవండి;
మీమీ కన్న బిడ్డల నొకతెకు
ప్రేమను నా పేరివ్వండి."

బలబల కన్నుల కన్నీరొలికెను
పుత్తడి బొమ్మకు పూర్ణమకు
కన్నులు తుడుచుకు కలకల నవ్వెను
పుత్తడి బొమ్మా పూర్ణమ్మ.

వగచిరి వదినెలు, వగచిరి తమ్ములు
తల్లియు కంటను తడిబెట్టన్
కాసుకు లోనై అల్లుని తలచుకు**
ఆనందించెను అయ్యొకడె.

యెప్పటి యట్టుల సాయంత్రమ్మున
యేరిన పువ్వులు సరిగూర్చి
సంతోషమ్మున దుర్గను కొలవను
వొంటిగ పోయెను పూర్ణమ్మ.

ఆవులు పెయ్యలు మందలు జేరెను
పిట్టలు చెట్లను గుమిగూడెన్
మింటను చుక్కలు మెరయుచు వొడమెను
యింటికి పూర్ణమ రాదాయె.

---

* తెచ్చి

** చూసుకు

చీకటి నిండెను కొండల కోనల
మేతకు మెకములు మెసల జనెన్
దుర్గకు మెడలో హారము లమరెను
పూర్ణమ యింటికి రాదాయె.

కన్నుల కాంతులు కలవల చేరెను
మేలిమి జేరెను మేని పసల్‌!
హంసల జేరెను నడకల బెడగులు
దుర్గను జేరెను పూర్ణమ్మ.

# పూర్ణమ్మ²

మేలిమి బంగరు మెలతల్లారా
కలువల కన్నుల కన్నెల్లారా
తల్లుల కన్న పిల్లల్లారా
విన్నారమ్మా యీ కథను

ఆటల పాటల పేటికలారా
కమ్మని మాటల కొమ్మల్లారా
అమ్మలగన్న అమ్మల్లారా
వినరమ్మా మీరీ కథను

కొండల నడుమల కోనొకటున్నది
కోనకి నడుమా కొలనొకటుంది
కొలను గట్టునా కోవెల లోపల
వెలసెను బంగరు దుర్గమ్మ

పూజారింటను పుట్టిన చిన్నది
పుత్తడి బొమ్మా పూర్ణమ్మ
అన్నల తమ్ముల కనుగై దుర్గకు
పూజకు పువ్వులు కోసేది

ఏయే వేళల పూసే పువ్వుల
ఆయా వేళల అందించి
బంగరు దుర్గను భక్తితొ కొలిచెను
పుత్తడి బొమ్మ పూర్ణమ్మ

పూర్ణమ్మ.

మేలిమి బంగరు మెలతల్లారా,
కలువల కన్నుల కన్నెల్లారా,
తల్లుల కన్నపిల్లల్లారా
విన్నారమ్మా యీ కథను

ఆటల పాటల పేటికలారా
కమ్మని మాటల కొమ్మల్లారా
అమ్మల కన్న అమ్మల్లారా
వినరమ్మా యీ కథను

కొండల నడుమను కోనొకటున్నది
కోనకి నడుమా కొలనొకటుంది
కొలనుకు గట్టున కోవెల లోపల
వెలసెను బంగరు దుర్గమ్మ!

పూజారింటను పుట్టిన చిన్నది
పుత్తడి బొమ్మా పూర్ణమ్మ
అన్నల తమ్ముల కనుసన్న దాటక
పూజకు పువ్వులు కోసేది.

ఏయే ఋతువుల పూసే పువ్వుల
ఆయా కాలల అందించి
బంగరు దుర్గను భక్తితో కొలిచి
ప్రార్థించేది ...

"పూర్ణమ్మ" ప్రచురణ మొదట ఎప్పుడు జరిగిందో తెలియదు. దానినే "పూర్ణమ్మ" అన్న శీర్షికతో దిద్దుబాట్లు చేశారు. పైన ఉన్నది, గురజాడ చేతి రాతతో వున్న మొదటిపుట.

ఏయే ఋతువుల పండే పళ్ళను
ఆయా ఋతువుల అందించి
బంగరు దుర్గను భక్తితొ కొలిచెను
పుత్తడి బొమ్మ పూర్ణమ్మ

పళ్ళను మీరిన తీపుల నడలును
పువ్వుల మీరిన పోడుములున్
అంగము లందున అమరెను పూర్ణకు
సౌరులు మించెను నానాటన్

కాసుకు లోనై తల్లీ తండ్రీ
నెనరూ న్యాయం విడనాడి
పుత్తడి బొమ్మను పూర్ణమ్మను వొక
ముదుసలి మొగుడుకు ముడివేస్రీ

ఆమని రాగా దుర్గ కొలనులో
కలకల నవ్వెను తామరలు
ఆమని రాగా దుర్గవనములో
కిలకిల పలికెను కీరములు

ముద్దు నగవులూ మురిపెములూ మరి
పెనిమిటి జూచిన నిమిషమున
బాసెను కన్నియ ముఖ కమలమ్మును
కన్నుల గ్రమ్మెను కన్నీరు

ఆటల పాటల తోటి కన్నియలు
మొగుడు తాత అని కేలించ
ఆటల పాటల కలియక పూర్ణమ
దుర్గను చేరీ దుక్కించె

కొన్నాళ్ళకు పతి కొని పోవచ్చెను
పుత్తడి బొమ్మను పూర్ణమను
చీరెలు సొమ్ములు చాలగ దెచ్చెను
పుత్తడి బొమ్మకు పూర్ణమకు

పసుపు రాసిరి బంగరు మేనికి
జలకము లాడెను పూర్ణమ్మ
వదినెలు పూర్ణకు పరిపరి విధముల
నేర్పులు మెరసీ కై చేస్రీ

పెద్దల కప్పుడు మొక్కెను పూర్ణమ
తల్లీ దండ్రీ దీవించి,
దీవన వింటూ పక్కున నవ్వెను
పుత్తడి బొమ్మ పూర్ణమ్మ

చిన్నల నందర కౌగిట చేర్చుకు
కంటను బెట్టెను కన్నీరూ
అన్నల తమ్ముల కప్పుడు పలికెను
పుత్తడి బొమ్మ పూర్ణమ్మ

"అన్నల్లారా తమ్ముల్లారా
అమ్మను అయ్యను కానండీ
బంగరు దుర్గను భక్తితొ కొలవం
డమ్మల కమ్మ దుర్గమ్మ

ఆయా వేళల పూసే పువ్వుల
ఆయా ఋతువుల పళ్ళన్నీ
భక్తిని తెచ్చి శక్తికి యివ్వం
డమ్మల కమ్మ దుర్గమ్మ

"నలుగురు కూచుని నవ్వే వేళల
నా పేరొక తరి తలవండి
మీ మీ కన్న బిడ్డల నొకతెకు
ప్రేమను నా పేరివ్వండి

బలబల కన్నుల కన్నీ రొలికెను
పుత్తడి బొమ్మకు పూర్ణమకు
కన్నులు తుడుచుకు కలకల నవ్వెను
పుత్తడి బొమ్మ పూర్ణమ్మ

వగచిరి వదినెలు వగచిరి తమ్ములు
తల్లియు కంటను తడిబెట్టన్
కాసుకు లోనై అల్లుని చూసుకు
ఆనందించెను అయ్యొకడె

యెప్పటి యట్టుల సాయంత్రమ్మున
యేరిన పువ్వుల సరిగూర్చి
సంతోషమ్మున దుర్గను కొలవను
నొంటిగ పోయెను పూర్ణమ్మ

ఆవులు పెయ్యలు మందల జేరెను
పిట్టలు చెట్లను గుమిగూడెన్
మింటను చుక్కలు మెరయుచు పొడమెను
యింటికి పూర్ణమ రాదాయె

చీకటి నిండెను కొండల కోనల
మేతకు మెకములు మెసల జనెన్
దుర్గకు మెడలో హారము లమరెను
పూర్ణమ యింటికి రాదాయె

కన్నుల కాంతులు కలవల చేరెను
మేలిమి జేరెను మేని పసల్
హంసల జేరెను నడకల బెడగులు
దుర్గను జేరెను పూర్ణమ్మ

# అభూత కల్పనా గాథకు ఇతివృత్తం

పాట రూపంలో వున్న యీ నాటిక గురజాడ అసంపూర్ణ రచన. ఆయన కుమారుడు గురజాడ రామదాసు చిత్తు ప్రతిని యివ్వగా, విజయనగరం నుండి వెలువడే 'విజయ' అన్న పత్రిక నలభై ఏళ్ళక్రితం మొదట ప్రచురించింది. తరువాత దక్షిణ ఢిల్లీ గురజాడ స్మారక సంచిక పునర్ముద్రించింది. ఇంతవరకూ గురజాడ రచనల సంపుటాల్లో వేటిలోనూ యిది చేర్చటం జరగలేదు. యథాతథంగా ప్రచురిస్తున్నాము.

## SUBJECT FOR AN EXTRAVAGANZA

A Young man makes love to a girl whom he offen sees on a terrace of a house. She notices his attentions signs etc. She is in her పుట్టిల్లు.

On moon light nights he goes along that street and listens to her music.

He sings snatches in the same tune. She replies,

She makes enigmatical appointments leading him to all kinds of escapades ending in embracing the దాసి.. Atlast she hatches a plot with the hero's wife, so that on a certain night the wife and the hero meet.

ఒకబ్బాయికి ఒక అమ్మాయి తరచు ఒక యింటి డాబా మీద కనిపిస్తూ వుంటుంది. అతగాడు ప్రేమ కార్యకలాపాలు సాగిస్తాడు. అతని హావభావాలు, సౌజ్ఞలూ అమ్మాయి గమనిస్తుంది. ఆమె వున్నది తన పుట్టిల్లు..

అతను వెన్నెల రాత్రిళ్ళ ఆ వీధిలో వెళ్తుంటాడు. ఆ అమ్మాయి పాట వింటూ వుంటాడు.

అదే రాగ వరసను తనూ పాడతాడు. అమ్మాయి జవాబిస్తుంది. కలుసుకోడానికి కంగారెత్తించే పథకాలు చెప్పి అతణ్ని రకరకాల చిలిపి పనుల్లోకి దింపుతుంది. చివరకవి దాసిని కావలించుకొనేట్టు చేస్తాయి.

ఆఖరున కథానాయకుడి భార్యతో కుమ్మక్కయి ఒకనాటి రాత్రి, ఆ అబ్బాయికి అతని భార్యే తటస్థపడే లాగా చేస్తుంది.

దీనికి గురజాడ పెట్టిన శీర్షిక 'అభూత కల్పనా గాథకు ఇతివృత్తం, అని. రచనా కాలం తెలియదు.

1

HE : చదలెల్ల వెదకెనే కొదమ చకోరము
(అతడు) కుదురైన రేవెల్గు కుదిసెనో యేమొ.

2

SHE: ఏ గాలి విసరెరా మగడ నిను యీ (ఆమె) వంక.
HE : తనువుకు తనువుకు తగులదె లంకె.

3

SHE: తనువుకు తనువుకు తగులొక లంకా ?
తగులన్న వగలన్న తలపోయు మింక.

4

HE : నేడేల కల్గెనె నెలత నీకీ శంక
(విను) మనసుకు మన్సుకు మరులెగా లంకె

5

SHE: మనసుకు మనసుకు మరులు వకలంకా ?
మరులన్న చెరలన్న మరవ బోకింక.

6

HE : మగువల మాటలు మగువరో వింత
తగులము వగయని తగవౌక కొంత ?

7

SHE: మగవారి బాటలు మరి మరి వింత
మగనాలిపై గాని మరులు కోరెంత.

8

HE : మాటలు కావిదె మనసిత్తు జూర
SHE: మనసొక్కచేయైతె మరి రాకు పోర.

9

HE : చెంతకు చేరిన చెనకుట మేలె ?
వంతల బెట్టకు వనజాక్షి యేలె.

10

SHE: నీ కాంత నేనైన నెన రుంతువేమో !
పరకాంత పొందంటె....

11

HE : నా కాంత నీవైతె నా భాగ్యమెంత ?
SHE: నీ కాంత నయ్యేద నిదె చూడు వింత.

# దేశభక్తి*

దేశమును ప్రేమించు మన్న
మంచి అన్నది పెంచుమన్నా;
వొట్టి మాటలు కట్టిపెట్టోయి
గట్టి మేల్ తలపెట్ట వోయి!

పాడిపంటలు పొంగిపొర్లే
దారిలో నువు పాటుపడవోయి;
తిండి కలిగితె కండ కలదోయి
కండకల వాడేను మనిషోయి!

యీసురోమని మనుషులుంటే
దేశమే గతి బాగుపడునోయి?
జల్డుకొని కళలెల్ల నేర్చుకు
దేశి సరుకులు నించవోయి!

అన్ని దేశాల్ క్రమ్మవలె నోయి
దేశి సరుకుల నమ్మవలెనోయి;
డబ్బు తేలేనట్టి నరులకు
కీర్తి సంపద లబ్బవోయి!

వెనక చూసిన కార్యమేమోయి?
మంచి గతమున కొంచెమేనోయి

* ఈ శీర్షికతోపాటు "దేశమును ప్రేమించుమన్నా" అన్న శీర్షిక కూడా వుంది.

మందగించక ముందు అడుగేయి
వెనుకపడితే వెనకే నోయి!

పూను స్పర్థను విద్యలందే
వైరములు వాణిజ్యమందే;
వ్యర్థ కలహం పెంచబోకోయి
కత్తి వైరం కాల్చవోయి?

దేశాభిమానం నాకు కద్దని
వట్టి గొప్పలు చెప్పుకోకోయి;
పూని యేదైనాను నొకమేల్
కూర్చి జనులకు చూపవోయి!

ఓర్వలేమి పిశాచి దేశం
మూలుగులు పీల్చె సెనోయి;
ఒరుల మేలుకు సంతసిస్తూ
ఐకమత్యం నేర్చవోయి!

పరుల కలిమికి పొర్లి యేడ్చే
పాపి కెక్కడ సుఖం కద్దోయి?
ఒకరి మేల్ తన మేలనెంచే
నేర్పరికి మేల్ కొల్లలోయి!"

స్వంత లాభం కొంత మానుకు
పొరుగు వాడికి తోడుపడవోయి
దేశమంటే మట్టి కాదోయి
దేశమంటే మనుషులోయి?

చెట్టపట్టాల్ పట్టుకుని
దేశస్థులంతా నడవవలెనోయి,
అన్నదమ్ముల వలెను జాతులు
మతములన్నీ మెలగవలెనోయి!

మతం వేరై తేను యేమోయి?
మనసు లొకటై మనుషులుంటే
జాతమన్నది లేచి పెరిగి
లోకమున రాణించునోయి!

దేశమనియెడి దొడ్డ వృక్షం
ప్రేమలను పూలెత్తవలెనోయి
నరుల చమటను తడిసి మూలం
ధనం పంటలు పండవలెనోయి!

ఆకులందున అణగిమణగీ
కవిత కోవిల పలకవలెనోయి
పలుకులను విని దేశమందభి
మానములు మొలకెత్తవలెనోయి!

**('కృష్ణా పత్రిక' 1913 ఆగష్టు 9. రచనా కాలం 1910?)**

దేశమంటె మట్టి కాదోయి
దేశమంటె మనుషులోయి

# దేశమును ప్రేమించుమన్నా

'దేశభక్తి' గీతానికి యిది యింకో శీర్షిక. ప్రసిద్ధమైన యీ గీతానికి ద్వారం వెంకటస్వామి నాయుడు కల్పించిన స్వరాలను, గురజాడ శత వార్షిక సంఘం (హైదరాబాద్) సంచిక ప్రచురించింది.

సింధు భైరవి రాగం-మిశ్ర చాపు తాళం

ఈ రాగము హనుమత్తోడి రాగము యొక్క జన్యము.

పా ప । ప ప సా ॥ పా ద । పా మా -
దే శ । ము ను ప్రే ॥ మిం చు । మ న్నా ।
గా రి ।* గా మ మ । గా రి । సా సా ॥
మం చి । అ న్న ది ॥ పెం చు । మ న్నా ॥
సా స ॥ గా గ గ ॥ మా మ । మా ॥ మా ॥
వ ట్టి । మా ట లు ॥ క ట్టి । పెట్టోయ్ ॥
గా మ । పా మ మ ॥ గా రి । సా సా ॥
గ ట్టి । మేల్ త ల ॥ పె ట్ట । వో యి ॥
పా ప । పా ప ప ॥ పా ద ॥ పా మా ॥
పా డి । పం ట లు ॥ పొం గి । పొ ర్లే ॥
గా రి* । గా మ మ ॥ గా రి ॥ స స సా
దా రి । లో ను వు ॥ పా టు । ప డ వోయ్ ॥

* ఈ గుర్తుగల రిషభము చతుశ్రుతి రిషభముగా పాడవలెను.

సా స ॥ గ గ మ మ ॥ మా మ ॥ మ మ మా ॥
తిం డి । క లి గి తె ॥ కం డ ॥ క ల దోయ్ ॥
గా మ । ప ప మా ॥ గా రి । స స సా॥
కం డ । క ల వా ॥ దే ను ॥ మ ని షోయ్ ॥

# మనిషి

మనిషి చేసిన రాయి రప్పకి
మహిమ కలదని సాగి మొక్కుతు
మనుషులంటే రాయి రప్పల
కన్న కనిష్టం

గాను చూస్తా వేల బేలా?
దేవు డెకడో దాగెనంటూ
కొండ కోనల వెతుకులాడే
వేలా?

కన్ను తెరిచిన కానబడడో?
మనిషి మాత్రుడి యందు లేడో?
యెరిగి కోరిన కరిగి యీడో
ముక్తి*

('కృష్ణా పత్రిక' 1912 డిసెంబరు 14)

* ఈ చివరి మాట "ముక్తా!" అని వుంది. ఇది అచ్చు తప్పు అయివుండాలి.

# దించు లంగరు

దించు లంగరు దీర్ఘ యుద్ధం
ధర్మ పక్షము ముల్లు చూపెను
నరుల పీనుగు పెంట పోకల
నాటి వెలయును శాంతి వృక్షము.

పాత సంధులు పాతిపెట్టుము
యుద్ధముల కవి ఉనికి పట్టులు
లోక మంతయు ఏకమై
యుద్ధమునె మారణము చేయును.

వచ్చెనిదె బంగారు కాలము
వాంఛ లెల్లను తీరు సుజనుల
కాంగిలేయుల ధర్మ రాజ్యము
జ్ఞానమును స్వాతంత్ర్యమిచ్చుచు
సంతతము వర్థిల్లు గావుత!

('కృష్ణా పత్రిక' 1915 అక్టోబరు 30)

# లంగ రెత్తువము

విరిగి పెరిగితి; పెరిగి విరిగితి;
కష్ట సుఖము లపార మెరిగితి;
పండు నన్నవి ఆశలెన్నో
యెండి రాలగ బొగిలితిన్.

అందజాలని పళ్ళ కోసము
అఱ్ఱు జాపితి; నేల పాకిన
చెట్ల పళ్ళను విలవ తెరుగక
పాదరక్షల మట్టితిన్.

తీపి విరిగిన చెరుకు వలె ఆ
నాటి కోర్కెలు నేడు బెండౌ
టెంచి నవ్వితి; బుద్ధి చపలత
కొ_త్త కోర్కెల తగిలితిన్.

దేవతలతో జోడు కూడితి
రక్కసులతో కూడి ఆడితి
కొ_త్త మిన్కుల తెలివి పటిమను
మంచి చెడ్డల మార్చితిన్.

చూతునా! అని చూసితిని; మరి
చేతునా! అని చేసితిని; ఇక
చూడ చేయగ రాని వింతలు
చూపి కన్నులు కట్టితిన్.

శత్రు మిత్రుల కిచ్చి నెనరులు
స్నేహ వార్థిని కొల్లగొంటిని;
నాటి మిత్రులు తరల శూన్యం
బైన పుడమిని నిలిచితిన్.

పంజరంబున నున్న కట్లను
పగల దన్నగ లేక స్రుక్కితి;
నింగి పర్వగ లేని జన్మము
నీరసంబని రోసితిన్.

"ఉసురులకు విసికితివా ? యుద్ధము
కలదు; దేశము కొరకు పోరుము."
యుద్ధమా ? ఇకనేమి లోకము !
చాలు ! చాలును ! లంగరెత్తుము.

(రచనా కాలం 1914 సెప్టెంబరు) ?

# ముత్యాల సరము*

వెల్లువగ నారోగ్య సంపద
ల్లుల్ల మలరుచు నిచ్చ్చగావుత
తల్లి భారత మాత పంచమ
జార్జి కెల్లపుడున్.

జార్జి సామ్రాట్చాసనంబుల
జాజి పూవుల దండ మాడ్కని
రాజ రాజులు శిరములందున
దాల్చ మనవలయున్

మర్మ మెరుగని ధర్మ మనియెడి
నిర్మలంబగు నీతి పథమున
పేర్మి ప్రజలను మలచు నేర్పరి
జార్జి మనవలయున్

భరత ఖండం బెన్న డెరుగని
నిరత శాంతి నొసంగి విద్యల
నెరయ నించిన యాంగిలేయుల
రేడు మనవలయున్

* 1912 లో ఐదవ జార్జి ఢిల్లీ రాక సందర్భంగా
రాసినది.

కొల్లబోవగ జంపి శత్రుల
ఢిల్లి పట్టము గట్టి బలిమిని
తొల్లి నల్లని దేవుడొక్క
డజాత శత్రునకున్

తెల్లవారలు నీతి నిపుణులు
ఢిల్లి పట్టము గట్టి రిపుడే
కల్ల యెరుగని జార్జిరేని
కజాత శత్రునకున్

నల్లవాడును తెల్లవాడును
నెల్ల శుభముల గూర్చ్చ గావుత
తల్లి మేరీ మహారాజ్ఞికి
జార్జి నరపతికిన్.

# మిణుగురులు

(పిల్లల గీతములు)

మల్లెలు మొల్లలు పూచే వేళ
చల్లని గాలులు వీచే వేళ
మేనుల గంధం బలదే వేళ
ఉరుములు మెరుపులు మెరసే వేళ
తొలకరి వానలు కురిసే వేళ
మామిడి పండులు పండే వేళ
మన్మథ బాణం మ్రోగే వేళ
మగువల మనసులు క్రాగే వేళ.

## 2

బూరుగు చెట్టు
చిలకలతోను
ఏమని పలికింది?

పండిన పండు
ఎండిన దూదై
పక పక నవ్వింది

## 3

చిలకల్లార
చిలకల్లార

# గురజాడ వారి పిల్లల పాట

చింతా చెట్టు చిలకల
ఏమని పలికిందీ?
"చిలకల్లారా చిలకల్లారా
ఛీ ఛీ పొమ్మందీ."
కొబ్బరి చెట్టు చిలకల తోటీ
ఏమని పలికిందీ?
"చిలకల్లారా చిలకల్లారా
ఛీ ఛీ పొమ్మందీ."
జామీ చెట్టు చిలకల తోటీ
ఏమని పలికిందీ?
"చిలకల్లారా చిలకల్లారా
రండీ రండందీ."
మామిడి చెట్టూ చిలకల తోటీ
ఏమని పలికిందీ?
"చిలకల్లారా చిలకల్లారా
రండీ రండందీ."

('విశ్వవీణ' 1959 డిసెంబర్ 1 వ తేదీ సంచిక నుండి. భమిడిపాటి సోమయాజి యీ పిల్లల పాట సేకరించి యిచ్చారనీ, యిలాంటి పిల్లల పాటలు అనేకం రాయడానికి గురజాడ సంకల్పించారనీ చెప్పబడింది.)

# సామవేదం*

పాడకోయ్ కవీ! కాంగ్రెస్ ఒక
భజన సమాజం మాత్రమే అనీ!
ప్రతినిధు లంతా నిద్రపోయినా
భవనం క్రిక్కిరిసిన సత్రమే సుమీ!

కాంగ్రెస్ నిత్యం, కాంగ్రెస్ సత్యం
స్వపరి పాలనం కాంగ్రెస్ గమ్యం
ఆత్మ అనే దీపం వెలిగేందుకు
ఆదర్శమనే తైలం ముఖ్యం!

కాంగ్రెస్ యుద్ధం-రూల్సు ప్రకారం
కాగితాలతో! నామకార్థకం!
అడపా దడపా అంతః కలహం!
అయితే బిల్‌కుల్ అహింసాత్మకం!

మితవాదులు నేర్పే గుణపాఠం
ఏ యే యెండల కాయా గొడుగులు!
కాదని బరిదిగి తిరగబడేవో
ద్వీపాంతర మే! లేదిక తిరుగుడు!

---

* మద్రాసులో 1908 లో జరిగిన కాంగ్రెస్ మహా సభ గురించి గురజాడ ఇంగ్లీషు పద్యాలకు శ్రీశ్రీ అనుసరణ. మూలం ఇంగ్లీషు విభాగంలో వుంది.

కావున జోరుగ కంఠశోషగా
ఉపన్యసిస్తూ నుంచుందాం!
అస్తమానమూ లాభం చూడక
రాజభక్తితో పొంచుందాం!

('తెలుగు స్వతంత్ర', 1953 నవంబరు 13)

శ్రీ

# నీలగిరిపాటలు.



శ్రీ శ్రీ శ్రీ హర్ హాయినెస్

ది మహారాజ కుమారికా సాహిబా

శ్రీ అప్పలకొండయాంబా

ఆఫ్ విజయనగరం.

మహారాణి ఆఫ్ మాధోగడ్ (రీవాస్టేట్) వారి

యనుజ్ఞను.



గురజాడ-అప్పారావుచే

రచించబడినవి.



చెన్నపట్టం

జి. రామసామిశెట్టిగారి

ముద్రాక్షరశాలయందు

ముద్రింపంబడియె.



1907.

అంకితం ఆనంద గజపతికి : TO THE LOVED MEMORY OF PRINCE CHARMING I DEDICATE THESE VERSES

GK_6

# సుందరతర మీ నీల నగము

రాగము, సురట - తాళము, ఆది.

ప ల్ల వి

సుందరతర మీ నీల నగము దీని।
యందము హృదయానందకరము దీని।
చందము హృదయానందకరము దీని।

అ ను ప ల్ల వి

నందన వన మిదె — నాతిరొ వింటివె।
బృందారక ముని - బృంద సేవితము॥

చ ర ణ ము లు

ఎచ్చటఁ జూచినఁ - బచ్చిక పట్టులు।
పొద పొద రొదలిడు - పొలుపగు - పిట్టలు।
వింత వాసనలు - వీచెడు చెట్టులు।
కుదురు రథ్యగల - కొలకుల గట్టులు॥

నిచ్చలు నగముల - నీటగు తోఁటల।
విచ్చలవిడి చను - నచ్చపు మొగుళుల।
నచ్చరఁగేరెడు - మచ్చెకంటు లిట।
మించు తీవలన - మించి చరింతురు।

పాద ఘట్టనకుఁ - బర్వు చక్రములు।
మంత్ర మహిమనగు - జంత్రపు రథములు।

పందెము వారెడు - పటు జవ నాశ్వము।
 లందముగా నిట - గ్రందయి తోచును॥

 గట్టుల లోయలఁ - గాజు చప్పరల।
మట్టి గోలెముల - మడువుల నడవుల।
 నెల్లెడ విరియగ - వెల్లువలై విరు।
లిక్షుధన్వు దౌన - లక్షయమయ్యెను॥

తప్పక భృత్యుల - నెప్పుడు బ్రోచెడి।
 యప్పలకొండయ - మాంబా దేవిని
నొప్పుగఁ బ్రోచుత - నప్పుర దమనుఁడు।
మెప్పగు వరముల - విప్పుగఁ గురియుచు॥

# ఊటీ చోద్యమేమి చెపుదు

రాగము, పంతువరాళి - తాళము, రూపకము

పల్లవి

ఊటి చోద్యమేమి చెపుదు - నువిద వింటివే।

అనుపల్లవి

సాటియేది యూటి కెందు-
స్వర్గమైన దీని క్రిందు.

చరణములు

వాటమైన తటములందుఁ-దోటలెంతొ సొంపు మీరఁ।
గూటములను సౌధరాజి - కుదిరి మెరయఁగా।
మాటు మణగి శివుని జటా - జూటముననుగంగ పగిది।
కోటి హ్రదములందు జలము - కొమరి యమరి యుండును॥

పండు వెన్నె లచటి పవలు - పావకుండు రాత్రులందు।
దండ నుండి యింట నింట - దయను బ్రోవఁగ।
నెండ దాడి కోడి సీతు - కొండ వట్టెనేమొ యనఁగ।
నిండు కొలువు హేమంత - ముండి యిచట వెలసెను॥

వెన్నుని సిగ నమరియున్న - వేల్పు తరువు విరుల మాడ్కి,
సన్న సన్న వెండి మబ్బు - చటియ లంటగా।

మిన్నుఋాయ సంజకాఁడు - మేళవించు రంగు లనఁగ।
వన్నె వన్నె పూలగములు - వనముఁ గ్రమ్మి మెరయును॥

వెండి కొండ దొరను బూజ - వేడ్కమీరఁ జేయు నప్పల।
కొండయాంబాధిరాజ్ఞి - కొలువు మహిమను।
దండి నీల నగము కనుల - పండువగను జూడఁగలిగె
రండు చెలియలార నేడు - పండెను మన సుకృత మెల్ల॥

('ఆంధ్ర భారతి' 1910 జూన్)

# ఉమాపతియర్చన

రాగము, భైరవి - తాళము, చాపు, మిశ్రజాతి.

పల్లవి

ఉదకమండలమున - నుమాపతి యర్చన
కోటి గుణితమై - కోరిక లీడేర్చును।

అనుపల్లవి

వెల్లనౌ మబ్బులు - విరిసి వెన్నెల గాయ।
వెండి కొండని సురలు - వేడ్కతో రాఁగ॥

చరణములు

కర్పూర తరువులు - కంబములై తోప।
మిన్ను పందిరిఁబోల - మించు దివ్వెలుగాఁ
బచ్చల హసిఁయించు - పచ్చికపై విరు।
లచ్చర లిడు ముగ్గు - టచ్చున వెలయఁగ॥

దేవదారు తరులు - దివ్య గంధము లీన।
యక్ష గానము మీఱి - పక్షులు పలుక।
రసిత మల్లదె శంఖ - రావమై చెలఁగగ।
దీవ లేమలు పూలు - తిరముగఁ గురియఁగ॥

ఆశ్రిత వరదుఁ డంబికా రమణుఁడు
బాలచంద్రమౌళి - భక్తికి నెదమెచ్చి।
రాజరాజపుత్రి - రాజ్ఞి నప్పలకొండ।
యాంబఁ బ్రోచుఁగాత - నధిక సౌఖ్యము లిచ్చి॥

("ఆంధ్ర భారతి" 1911 ఆగస్టు సంచిక)

# నాటిమాట

రాగము, అఠాణా - తాళము, రూపకము

పల్లవి

నాటి మాట మఱచుట యే।
నాటికైన మఱవ వశమ॥

అనుపల్లవి

బోటి ప్రాణ మీ వంటి, ము
మ్మాటికి నిను విడ నంటి॥

చరణములు

మాట మూట గట్టికొని।
పాటి దప్పి తనుట నా పొర
పాటుగాక, మాటన నే।
పాటిర నీ సాటి దొరకు॥

బ్రతుకు నందు లేని స్థిరత।
వెతకనేల భాషయందు।
నతుకు వేష భాష కోడు:।
నతివలదే తప్పుగాక॥

సాటి లేదు నా కంటివా
మాట నిజము నేడు గంటి।
సాటి కలదె నమ్మి భంగ
పాటు పడిన పడఁతి కెందు॥

మేటివైన నీ యెద మొగ
మాట మెటులంబాసె, నొక్క
మాటురా, నీ యోటు మాటె
కోటి ధనము లిచ్చి కొందు॥

# లేవొకో మంత్రములం

రాగము, శంకరాభరణము-తాళము, ఝంపె.

లేవొకో మంత్రములు-లేమగాఁజేయ నిను।
లావపుడు బయలు బడు నొక్కొ।
రావనుచు నీలాటి-కాంతునకుఁ జిక్కినీ
భావమున నలయికను బడుదొ॥

మంచియును చెడ్డయును మానమును
గనక పటుః
వంచనను పరకాంత దగిలి।
యించుకయినను లోక-మెంచునని భీతిలక
కొంచెతన మూను టది కొమరొ॥

మగఁడవై పగ తీర్చు-పగతుఁడవు గాక నిదిః
తగునటర తలపోయకుంట।
మిగిలినది లేదు రిఁక మీఁద నిను నమ్మ నా।
నగధరుని నమ్మెదను లేరా॥

# చిత్తరువని చూడ

రాగము, శంకరాభరణము - తాళము, మిశ్రజాతి చాపు

పల్లవి

చిత్తరువని చూడఁ జిత్తము గొంటివి।
చిత్తజు నపరంజి - చిలుక యెవ్వతెవే॥

అనుపల్లవి

వత్తువా నా మ్రోల - వలరాజు వేఁడిన।
మత్తకాశిని సీదు - మనమైన సీగదె।

చరణములు

ఇచ్చి పుచ్చుకొంట - యిలలోని మర్యాద।
ముచ్చిలి మౌనము - మెచ్చుదురటవే।
వచ్చి చూచినంత - వంచనఁజేయుదె।
పచ్చి దొంగతనము - పఁడతిరో పరువె॥

మనసులేని తనువు - మరి యేలనే నాకుఁ।
చెనటి దీనిఁ గూడ - చేకొనఁగదవె।
వానికి బదు లొక్క - వాక్కు నే వేఁడెద।
మానిని యీపాటి - మన్నింపఁ జెల్లునె॥

విలువ చాలదన్న - విరివిల్తుపై నాన।
కలుగు జన్మములఁ - గానుక కొనవె।
ఎలిమి నానందేంద్రు నేలిన వెన్నుఁడు।
పలు తెఱుఁగుల మేలు - పడతి నీ కిచ్చునె॥

## * సుందరతర మీ నీల నగము *

రాగము, సురట - తాళము, ఆది

పల్లవి

సా ని ధ ప మ మ గ రీ ని గ రి రి స ని స
నీ స రి రి మ గ రి రి ప మ గ రి రి - సా.
నీ స రి రి మ గ రి రి ప మ గ రి రి - సా.

అనుపల్లవి

రి మ ప ని ని స రి గా రి స ని స రి
సా సా ని ధ ప మ గ రి స రి మ ప ని - సా.

చరణములు

రి మ మ మా గ రి ప్ప మ రీ రి రి
రి మ రి మ రి స ని స రి మ రి మ పా ప్ప ప
రి మ ప ని ని స రి గా రి స ని స రి
సా సా ని ధ ప మ గ రి స రి మ ప ని - సా.

## * ఊంటి చోద్య మేమి చెప్పుదు *

రాగము, పంతువరాళి - తాళము, రూపకము

పల్లవి

సా ని ద ద ప మ మ గా మ గ రి స స స రి గా రి గ రీ ప.

అనుపల్లవి

రి స గా రి స ని ధ ధ నీ స సా ని ద ప మ గ రి గ మా పధని-సా.

చ ర ణ ము

గా మ పా మ గ గ మ రీ స స గ రి గ గ రి గ మ పా మ
ప ధ ని ద మ గ గా గ రీ స-స స రి గ రి గ-మ ప గ రి ప
గ మ ప ధ ని ప ద ని ని స గ మ ప ద ని ధా ని ని స స
సరి గరి గగరీ సని నిధ-సస ధపమ గమ పదని-సా.

### * ఉమాపతి యర్చన *

రాగము, భైరవి-చాపు, మిశ్రజాతి

ప ల్ల వి

ధ ని ప స స నీ ధ పా। ప నీ ధా ప మ గ రీ
రి ని ధ ని స రీ రి గ మా పా మ గ రీ

అ ను ప ల్ల వి

ప మ పా ధ నీ స రి స గా రి స నీ ధ ప
ప ని స రీ ని దా ప ప ద ని ధ ప మ గ రి మా ప ధ ని.

చ ర ణ ము

ప ద ని న్ని ధ ని ని ధ। ని ప ధ ని ద ద మా ప ప
ప పా మ గ రి రి గ సా గ రి గ మ దా ప
ప మ పా ధ నీ స రి స గా రి స నీ ధ ప
ప ని స రీ ని ధా ప ప ద ని ధ ప మ గ రి మా ప ధ ని। స స

### * వాటిమాట *

అఠాణ, రూపక తాళం

ప ల్ల వి

గా ఘ ఫా ఫ ని ఫ ని ఫ ధా। ని స ఠీ స ని స ధా ధ ప ఘ-ఫ.

అ ను ప ల్ల వి

ని స గా రి స-స రి స ని ధా ని స

స ని స రి స రి స ని పా ప। పా ని ధ ప మ గ మ పాప-గామప

చ ర ణ ము

పా ప పా ప గా మ ప ప

దా ద ధా ధ ప ద ని ద ప గామ ప-ని స గా రి స-

స రి స ని ధా ని స - స ని స రి స రి స ని పా ప - పా ని

ధ ప మ గ మ పా ప-గా మ ప

### * లేవాకో మంత్రములు *

శంకరాభరణం, ఝంపె తాళము

మ గ మ పా పా ప ప మ గ మ ప మ గా గ రి-గా మ ప మ

మ గ గ రీ గ మ పా। మ గ మ పా ధ ని సా స ని స రి స ధ ని

స ని - పా ద నీ ధ ప మ గ రి స॥

### * చిత్తరువని చూడ *

శ ం క రా భ ర ణ ము

తాళము-మిశ్రజాతి, చాపు.

ప ల్ల వి

ప గా మా ప ధ పా ప। మ ధ ప మ గ గ మ ప గా మ

రి-మ ధ పా ప మ గ మ రి సా సా। స గా గా మ ప రి స-

అ ను ప ల్ల వి

ప మ గా మా ధా ని ప। ని స రీ స ని ధ ని సా। పద

దా ని సా ని ధ ధ ని। సా సా ని ధ ప మ ద పా మ గ రి

స-పా॥

చ ర ణ ము

మ పా మ ప మా గ గ మరి। గ గ పా మా

ప మా ప ప। గ మ ధ ప మా గా రి స। గ గా మా ప ద పా

ప మ గా మా ధా ని స। ని స రీ స ని ధ ని సా। ప ద

ధా ని సా ని ధ ధ ని సా స ని ధ ప మ ద పా మ గ రి స పా॥

## TRANSLATIONS INTO ENGLISH

### Beautiful are the Blue Hills !

Chorus Beautiful are the Blue Hills, and their beauty gladdens the heart. Verily this is the garden of the gods, and gods and sages love to roam here.

Everywhere the eye meets expanses of green grass. Birds sing sweetly from every bush. The pine odours fill the air. Lovely drives sweep round limpid lakes.

In the masses of clouds that love to haunt the gardens on the hill slopes, fish - eyed damsels flit about like lightnings.

Wheels that speed under tread, cars that mock the powers of magic, and swift horses that race, move along in beauty.

On ridges and in valleys, in lakes and in forests, and in pots and in glass houses, flowers grow everywhere in profusion. So the quivers of the god of love are inexhaustible here.

May Siva, the Destroyer of the Puras, shower choice blessings on Appala Kondayamba Devi, who is kind to her servants.

## The wonders of Ooty

*Chorus.* Listen, friend, how can I
describe the wonders of Ooty ?

Ooty has no equal :

Heaven itself is inferior.

Beautiful gardens cover the gentle slopes of the hills, and palaces glitter on the peaks. Like Ganga on Siva's head, a hundred lakes nestle in the valleys.

Here sunshine is mellow as moonlight, and at night, the fire god gives comfort in every home. Worsted by Summer on the plains, Winter has to these mountain fastnesses and holds sway here.

Silver clouds rest on the peaks like kalpa blossoms on the head of Krishna, and many - hued flowers spread over the hill sides and shine like colours mixed by Evening to paint the dome of heaven.

Come, friends, our merit has attained fruition, and we are enabled to see the great Blue Hills by the kindness of the King's daughter Appala Kondayamba.

## Worship the Lord of Uma

*Chorus* Worship the Lord of Uma on the Blue Hills and you acquire merit a thousand fold

White clouds envelop the peaks and make moonlight—and gods take the Blue Hills for, the silver mountains and crowd with the enthusiasm.

They witness Nature's worship of Siva there. The tall eucalyptuses form columns and the sky the awning. Lightning serves for lights and flower beds in the midst of green grass look like ornamentation of the floor by wood-nymphs in coloured powders.

The pines waft divine odours, and the birds sing as never nymphs sang. The thunder serves as the music of the conchshell and creeper damsels shed flowers.

May the Lord of Ambika who wears the moon-crescent as a crest-jewel save Maharani Appala Kondayamba daughter of the great king, pleased with her devotion.

## The Word of Long Ago!

*Chorus.* Can I forget your forgetting that word of long ago?

You said I was your life.

You promised never to part.

To treasure a *word* and to task you with unfaith is *my* fault. Of what count is a *word* to a great one like you?

Why should one seek in a *word* stability which one misses in Life? Woman are to blame who turn thralls to words and ways that are not of the man.

You said I had no equal. I now realise the truth of it. Where will one find another woman like me who trusted and suffered?

How has campassion left the breast of a great one like you? Come to me but once and I will buy even your false world for a crore of gold.

## Is there no Magic

Is there no magic that will transform you into a woman? Would then your courage become plain? Would you, entangled in the wiles of a lord like you, suffer pangs of the heart?

Not to consider good and bad and honour, and to take to another man's wife, not to heep the talk of the world, and to grow little—was that wise?

Are you a feoman of a previous birth born as husband to be revenged! Not too late. I shall not trust you hereafter shall trust in God!

## I Took You for a Picture!

*Chorus.* I took you for a picture and looked. You stole my heart.

Who may you be. O gold parrot of the god of love?

If I pray of him will he send you to me? Beautiful one, at least give me *your* heart.

To give and take is the rule of the world. Do the wise approve of stealth and silence? Is one to be cheated for going and seeing? Is open robbery a credit?

What do I want with a body devoid of mind? So take that also. In return for both I crave but a *word*. Oh, fair one, you may concede this much.

If you think the price small, I present to you lives to come, and I call the god of love to witness. May Vishnu who ruled that heart of Prince Anandaraja bless you!

# సుభద్ర

పండుగ దండిగఁ బర్వెను
గొందకు నలుగడల; నొక్క కోనను విడిగా
నుండి కిరీటియుఁ గృష్ణుడు
మెందగు మంతనములందు మెలఁగెడు వేళన్.

కల కల నగవులు మగువల
కల భాషలు నంగదముల గలగల రవముల్
చెలఁగి వన వీధి నొక తఱి
నల విఱిగిన భంగి విఱివిఁ యణఁగె బొదలలోన్.

అంతట నొక్క కాంత యల కాంతము లల్లలనాడఁ దెమ్మరన్
జెంత వనాంతము న్వెదలి చేరఁజనెం; దొవకావి చీరపై
వింత మెఱుంగు రశ్మికలు వెల్వఁగ బంగరు కత్తళంబు, వి
క్రాంత విలాసముల్ నడలఁ గన్నులఁజెన్నులు వెల్లుగొల్పుచున్.

అడుగడుగున నూపురముల
చడి, వీణియ మీటు మాడ్కి సలువ, నరునకున్
గడు హృదయాహ్లాదము, నొక
పడఁతుక * యేతెంచి నిలిచెఁ బజ్జను హరికిన్.

ఈ రెండ దాఁకి చెదరఁగ
నీరజముఖి తళుకు మేన, నెలతుక మించెన్

---

* పాఠాంతరము : పడఁతుక యేతెంచి కృష్ణు పజ్జను నిలిచెన్.

వారిజ కింజల్క శ్రీ
వారంబున వెలసి మెఱయు వరలక్ష్మి క్రియన్.

హరి కెఱగి చెలియ నరుఁగని
మరుఁ గనిన తెఱంగు దోప మదిఁ గొండొక త
త్తరము వొడమ నొయ్యారము
మెరయ నొఱగెఁ దపసి కలిమి మిన్నులు ముట్టన్.

గరిత హారంగు గొల్పె నరు కన్నులకున్ మిఱుమిట్లు; చూడ్కు ల
మ్మరుని కటారులై పొడువ మర్మము, దిగ్భ్రమ మావహిల్లె; సుం
దరి ధనువూను సోయగము ధైర్యము ద్రిప్పె; నినుండు దోచె మో
మరయ; నెఱుంగఁ డిట్టి యసమాద్భుత విక్రమ మెట్టి పోరులన్.

"అమ్మా!" యని చెలి శిరమున
నెమ్మి గరంబుంచి పలికె నీరజనేత్రుం
"డిమ్మౌని కరుణ సౌభా
గ్యమ్ముల నవ్వారిగాఁగఁ గాంచెద" వంచున్.

కపట మౌనిఁ జూచి కన్నియఁ జూచుచు
గన్నెఁ జూచి కపట మౌనిఁ జూచి,
చిత్త మలరఁ దలఁచెఁ జిత్తజ జనకుండు
నేఁడు గంటి నలువ నేర్పటంచు.

మొలక నగవు దోప మోమున; వసుదేవ
తనయు డనియె మాయ తపసి తోడ;
"కాదె భావి నీకుఁ గరతలామలకంబు
మౌనివర్య! కలదు మనవి యొకటి."

"భద్ర యిదె కొలిచె, రైవత
కాద్రిని వరుఁగోరి; కరుణ నరసి తెలుపుఁడీ!
రుద్రుండగునో, వరుణుఁడో, ని
ర్నిద్ర పరాక్రముఁడు నరుఁడొ, నీరజభవుఁడో!"

ఱెప్పల డాఁచిన నగవులు
ముప్పిరి గొని ముందు కుఱుకు మురహరు మోమున్
విప్పఁ గనుల వీక్షించుచు
నెప్పగిదినిఁ బలుక నేర క్రిందఁజూఁడున్నన్

హరి యనియె "నిట్టి సిద్ధులు
మఱుఁగు పఱుతురమ్మ క్రొత్త మనుజుల కడఁడా
రెఱిఁగిన యర్థంబయినను;
గురుతర పరిచర్యఁ గూడి కూర్తురు శుభముల్.

* ఘటనా ఘటన సమర్థులు
గుటిలపు విధి వ్రాఁతనైనఁ గుదురుపఱచు వా
క్పటిమ గల పురుష సింహము
లెట పఱచుఁ గటాక్ష మొదువు నీప్సితము లటన్.

కేవల నరుఁడే యీతఁడు
భూవలయము చుట్టి పుణ్య భూమి లరయుచున్

---

* "అఘటిత ఘటనా", "అఘటనా ఘటనా" అని సంప్రయోగములు.
పాఠాంతరము - ఘటనా ఘటన సమర్థులు
నిటలంబున బ్రహ్మ వ్రాయు నిర్ణయ పఙ్క్తిం
బటు నిష్ఠా పాటవమున
నటు నిటు సేయంగ నేర్తు రార్తులఁ బ్రోవన్!

రావలసి వచ్చె నిట నినుఁ
బ్రోవను; సేవించి వేడ్కఁ బొందుము శుభముల్.

కాంచి నరు సుభద్ర 'కంటినా మును వీని'
నన్న శంక మనసు నలమి కొనఁగ
'నెఱుఁగకున్న వీని నెఱిగినట్లున్నది;
మంచిగూర్చు' ననుచు మదిఁ దలంచె.

అన్న వీని నెన్న నధికుఁడు కానోపు
నెన్నకున్న వీని చెన్నుఁ జూడ
నన్నుఁ బ్రోవ వచ్చె నర రూపమును దాల్చి
మానవైరి యంచు మదిని దోచె.

నరుఁ గూర్చిన నరుఁ గూర్చును;
నరుఁ గూర్పకయున్న నాకు నరుఁడై గురుఁడై
దరిఁ జేర్చు; నిహము నోఁచమిఁ
బర సాధనమైనఁ గనుట పాడి దలంపన్.'

'పెద్ద యన్న నరుని పేరైన విననొల్లఁ
డొరుని కెపుడు నన్ను నొసఁగఁ జూచు
గురుల చేతనుండుఁ దరుణీజనము పెంపు
వారు మెచ్చు వాఁడె వరుఁడు మరుఁడు.'

కించయేల నాకుఁ గృష్ణుఁడు నా యెడ
నున్న వాఁడు లోక మెన్ను వాఁడు
వాని పనుపు సేయ వమ్ముగా దేనాఁడు
యతని గొలిచి విజయ నధిగమింతు

అర్జునుండు దలఁచె 'నమృతంబుఁ గొనునాఁడు
వెన్నుఁడెత్తి నట్టి వేస మిదియె
విప్పుఁగన్నులందు వెలయు ప్రసాదంబు
నిప్పు గప్పినట్టి నివుఱు గాదె?'

'పసితనపు టాటపాటల
విసువని విలువిద్య దొడ్డ వేడ్కఁ జెలంగన్
గుసుమాస్త్రుఁడెన్నఁ డెరుఁగని
యసమాయుధ కౌశలంబు లబ్బె గరితకున్.'

'లఘు నమనోన్న మనంబును
లఘు రయమును నంగముల విలసితము లగుటన్
సుఘటిత లావణ్యం బీ
జఘన ఘనకుఁ దెచ్చికొనని సౌరులమర్చెన్.'

"వీరుఁడన్నవాఁడు ధీరంబుగల యిట్టి
భామ నేలు భాగ్య మొదవెనేని
గాల ముందు దనుకఁ గతలందు నుతికెక్కఁ
కడిమి మీఱు సుతునిఁ బడయకున్నె.'

'వాసు దేవుఁడపుడె వాగ్దాన మొనరించెఁ
గొందు దీని నడ్డ మెందఱైన
రాముఁడొకడు దక్కఁ రౌహిణేయునిఁ బోర
గడఁగరాదు గనులు గప్పవలయు.'

తలఁచె నిట్లు నరుడు; తలఁచి నంతనె వచ్చెఁ
దాటి సిడవు జోదు; తప్పటడుగు
మేని చందనంబు మైకంపుఁ గనుచూ
ఘండుగాఁడి నడ్డి నిండు దెలుప.

* ఎఱింగిఁ భద్రయుఁ గృష్ణుడు
నరుఁ డవనత వదనుఁడయ్యె; నగి బలరాముం
“దరసితి” ననె “మిము గానక
దొరకితి రిపు డిచటఁ దోడి దొంగ లిరువురున్.”

“సరి, సరి, మునియొకఁ డమరెనొ?
మఱి కృష్ణుఁడు మఱచు జగము; మన భద్రన్నన్
వరుఁగోరి తపముఁ జేసెడి;
గురు జనములఁ గన్న సేవ గురుకొని చేయున్.”

“కూర్చుండుఁడయ్య మీరలు
కూర్చుందము మనము; వింటె కురు వీరులలో
నేర్చు మగఁ డతం డితండని
యేర్చుచు వాదిడిరి బాలు రెఱుఁగుదు చెపుమా!

“నరుని యెడఁ బక్షపాతము
పఱుపక యున్నట్టి మాట పల్కుము;” పల్కెన్
హరి “యెటు పలుకం జెల్లును
బరులకు? ఈ మేటి తపసి ప్రక్కనె యుండన్.”

“ఇల యెల్లం గాలించుచు
మలసి మలసి పురుషవరుల మహిమాన్వితులం
గలసి భవ మీఁదు తెఱువులు
తెలియుఁ దిగులు మనములోనఁ దివిరి కొనంగన్.”

* “శబ్దరత్నాకరమందు “ఎరఁగు” - “ఎఱకు” అని రెండు రూపములు ఉన్నవి. గాని “ఎఱఁగు” తప్ప ప్రమాణముగా నుదహరించిన ప్రయోగము కనబడదు.” (సుమారు నలభయ్యయిదు సంవత్సరాల క్రితం “సుభద్ర, మాటమంతీ” అన్న గురజాడ రచనల సంపుటాన్ని ప్రచురించిన విజయనగరం, “రామానుజాచార్య విద్యాసమితి” అట్టపీఠిక).

"విన్నాఁడట హరి యీనాఁ
డున్నాఁ డవతారమెత్తి యుర్వినని, యతం
డన్నాడఁట నీవే యని,
కన్నారఁగ నిన్ను గాంచనా నిటు వచ్చెన్."

గొంతు కొకింత మార్చుకొని గొంతి సుతుండనె "నో బలాఢ్య! నీ
యంతటివాని ముందొరులనౌనె గణింప; మనుష్య మాత్రులా
వెంత; భవిష్యమెంత! జనులేల యెఱుంగరొ నిన్నెఱింగియున్
సంతత సత్యవర్తనమె సత్వము జీవులకన్న ధర్మమున్."

"ధర్మముండుచోట దైవ బలంబుండుఁ
గలుగ దైవ బలము గలుగు జయము,
విఱ్ఱవీఁగు జడుఁడు విజయంబు దనదంచు
మున్న లోకపాలు రెన్నినట్లు."

"అనిమొన నొంచి రక్కసుల నాత్మబలంబులె కారణంబుగాఁ
గొని రమరుల్ జయంబునకుఁ గొండొక యక్ష మెదిర్చి గాలి న
గ్నిని గని మీరలీ తృణము కేల్కొని[1] త్రోయుడు కాల్చుఁడన్నవా
రనువది గామి, గుర్తెఱిఁగి రాత్మబలంబుల పారతంత్ర్యమున్."

"ఐనను వృష్ణి కుమారులు
పైన గనంగలరు పోటువాసులు; పో రెం
దైఁన బొసంగ[2]కున్నె దురభి
మానము కౌరవుల యెడల మల్లడిలం[3]గన్."

1. "చేకొని" - "కీకొని" మాదిరి ప్రయోగముగాబోలును. (రా.వి.స)
2. పొసగు-(అనుకూలించు) పొందదు; పొదమకున్నె అని కవి భావము "దొసంగు" "పొసంగు" వంటి ప్రయోగము.
3. "మచ్చరిలంగ" పాఠాంతరము (రా.వి.స.)

"కల దంతశ్శత్రుచయం
బలము బలం బా ప్తవేష మతిమానుషమై
యలయించు నెంత వారల
వెలి శత్రుల వెతకు వాఁడు వెడఁగు దలంపన్."

"కావున శత్రుని మిత్రుఁగ
నే వెరపునసైనఁ జేయు నేర్పరి బలియుం
డావల నంతశ్శత్రుల
కావర మణగింపగలఁడు కాల మలవడన్."

"ఎఱుఁగనియ ట్లొరు నడుగుట
మఱుఁగుపరచి దైవ జన్మ, మానుష లీలల్
నెఱుపుట గాకి వెరుఁగని
పరమార్థం[1] బొందు గలదె ప్రజ్ఞాననిధీ."

"ఎద్దానికైన మీరలు
దిద్దక మముబోంట్లు నిజము తెలి వెరుఁగుట గా
దద్దారి గనక వట్టివి
సుద్దులు నేర్చితిమి; యగునె సూక్తులను బనుల్."

"వసు దేవుని బిడ్డలు మీ
రసదృశ మహిమానుభావు లాప్తులు చెంతన్
వసియించి, కొంతకాలము,
పసగల సద్వస్తు వొకటి పట్టఁదలఁచితిన్."

"కంటిని మిము ధన్యుఁడ నను
కొంటిని; మీవంటి వారు కూరుట తపపుం

1. "పరమార్థంబొకటి" (రామానుజాచార్య విద్యా సమితి)

బంట కదా; నను( గను(డొక
కంటను, గన్నంత నాకు( గల్గు శుభంబుల్."

ప్రేమ పెనగొన్న చూపున
రాము(డు తన తమ్ము( జూచి రంజిలి పల్కెన్
"ధీమంతుం డీ తాపసు(
డేమందును మనదు భాగ్య మెఱి(గితి మితనిన్.

"కల రిల నెందఱో యతులు కాంచి యెఱుంగము వీని యట్టి ని
స్తుల సదసద్వివేకనిధి సూనృత వాక్కుల నాభిరాము స
ల్లలిత శుభానుభావు, విమలాత్ము, విచక్షణు, నిట్టి వాని( బూ
జల(దనియించి కొన్ని దివసంబులు నిల్పుట యింట నొప్పదే.

"యదువీరు లెల్ల నీ ఘను
నదను లెఱి(గి భక్తి( గొల్వ నాత్మజ్ఞానం
బొదవు; భవ జలధి గడ పెడు
చదురుం దలవడుట పూర్వ జన్మ ఫలమొకా?

"ఎందెందు( గలుగు తీర్థము
లందలి మహిమల నీ మహాత్ముని వలన
న్విందము; పరమార్థంబుల(
గందము; వీనులకు విందు గద సూనృతముల్.

"మన భద్రయు నీ తపసిని
బనిగొని సద్భక్తి భోజ్య భక్ష్యంబులచే(
దనిపెదు(గా కద్దానను
గనకున్నే రాజరాజు( గాంతుని( గా(గన్."

గారాబ మొల్కు కన్నుల
నా రాముఁడు భద్రఁ గాంచి నరుని కనియె "నీ
నారీమణి రైవతకము
నారాధించిన ఫలంబయౌ నినుఁగాంచెన్;

"నీ దాసిగ గొని చెలియల
నేదానను లోపమున్న నెఱుఁగ దెలుపుచున్
మోదానఁ గొనుఁడు పూజలఁ
గాదనకుఁడు ముద్దు గడిపి కారుణ్యముతోన్.

"కత్తిమొన బ్రతుకు జోదుల
పొత్తు గదా బ్రహ్మ వ్రాసెఁ బొలఁతులకు మా
యుత్తమ రాజ కులంబుల
నెత్తమ్మికి నిశితకరుని నెయ్యముఁవోలెన్.

"బాణాసన తూణ తను
త్రాణము శైవము నుండి తాల్చుచు నొక వి
న్నాణంపు జోదు తానై
ప్రాణంబుల సరకు గొనదు భద్ర మగఁటిమిన్.

"పుట్టింట నుండు కాలం
బెట్టెట్టుగ నున్నఁ జెల్లు నింటికి, మఱి తా
మెట్టిన యింటను మెలఁగెడు
గుట్టు తెలియకున్న నెట్లు కూరు సుఖంబుల్.

"దారుణము క్షత్రధర్మం
బీరసముల కిరవు దొల్లి యేర్పఱచిరి, యే
కారణమొ ధర్మకర్తలు
పూరుషులకుఁ జెల్లుఁగాక పొలఁతుల కేలా?

"పారంబులేని యోరిమి
గూరిమి బాంధవుల పట్ల గురుజనములచో
గారవము భృత్య వర్గము
నేరు పెఱిఁగి యేలుకొంట నెలఁతకు నీతుల్.

"కణపవల మీరు భద్రకు
నిరపాయ సుఖంబు లిచ్చు నీతి పథంబుల్
వర మీవలె నెన రెఱిఁగిన
నరవరు మీయట్టి కాంతు నాథు బడయఁగన్."

తమ్ముడు పలికె "తథాస్తు" ని;
నెమ్మొగమును వాంచి భద్ర నేత్రాంతములం
జిమ్మె నరుని యెడఁ జూపులఁ
గమ్మ విలుతు మాటు వెడలు కటకు శరములన్.

అంతట మదిరను గ్రోలెడు
చింత మనము నందుదోపఁ సీరధ్వజుఁ డా
వింత తపసి వీడ్కొని చనె;
నంతి పురముఁ జేరె భద్ర యత్యుత్సుకయై.

## రెండవ భాగము

కస్తూరి గన్నేరు కావి చీర మెఱుంగు
మేని చాయకు వింత మిసిమిఁ గొలుప
చెలరేగు ముంగురుల్ చేర్చి కట్టిన జోతి
ఝురులపై రిక్కల కరణి వెలుఁగ

పైటపైఁ దూగాడు పచ్చల హారముల్
చలదింద్ర చాపంబు చాడ్పుఁ జూప
నిద్దంపుఁ జెక్కుల దిద్దిన పత్రముల్
మకరాంకు బిరుదాల మాడ్కి వఱల

మెఱపు, కెమ్మబ్బు లోపల మెఱయునట్లు
వలిపమున మేల్మి మొల నూలు తళుకులీన
భద్ర నడతెంచె బంగరు పళ్లెరములఁ
బండ్లుఁ బూవులు గొనుచు సపర్య కొరకు.

మగని కడ కేగు నెలఁతకుఁ
దగు నీ కైసేఁత గాక తపసిని దోడ్తోఁ
నెగఁజూచుట కాదే! యీ
సొగసరి, నీ రీవి నంప సుమ శరము వడిన్.

యతి నియతిఁ గోలుపోని
మ్మతివను గన్నంత మాత్ర ననిమేషత్వం
బతను విభూతియుఁ గాంచడె,
యతిమై తాఁబొందఁ జూచు టంతయు కాదే?

మంచి నటింతురు *తన్పక
వంచనపరులైన వారు; వారిఁ గని జనుల్
మంచనె పాటింతురు; మఱి
వంచనె వంచకుని చెఱప వంచించుఁ దుదన్.

యతి మీదికి మతి వోవుట
మతిపోవుటగాఁ దలంచి మానిని యెంతో

* "తల్పగ" లేదా "తప్పక"

ధృతిఁ గడఁగె మరులు మరలుప
మతి ద్రిప్పిన కొలది జోకు మితి గడచుటయున్.

"పొత్తులనుండ బెద్ద లిది పోలునటంచుఁ దలంచినట్టి యా
పొత్తుఁ దలంప కీ మగువ పుణ్యవతీ తిలకమ్ము నోచె, ము
న్నత్తగఁ గొంతిదేవి నను నమ్మల కన్నుల పెంపుదక్క యీ
రిత్త తపస్విపై మరులు రేఁగుట కానక మోసపోయితిన్.

"నవ్వఁదొడంగి రీ గతికి నా వదినె ల్తలలూపి ఖిన్నులై
నొవ్వగఁ బల్క జొచ్చిరి కనుంగవ నశ్రులు గ్రమ్మ చేటు; లీ
రవ్వఁదలంపఁగాని, మదిరాల్పడి గుండె, నెఱింగెనేని యా
కవ్వడి నొచ్చి చుల్కనగఁ గాంచు గదాయని నాదు శీలమున్.

"ఏడు లోకంబుల నెనలేని* విల్లుకాఁ
డెవ్వాఁడనన్న గవ్వడి యనంగ
సాటివారల పట్ల సౌహార్ద మొనరించు
మేటి యెవఁడన కిరీటి యనఁగ
నెనరు నేర్పులు గల్గు నెఱజాణుఁడెవఁడన్న
నింద్రజుండని లోక మెన్ని పల్క
పెద్దల కడ భక్తి పిన్నల యెడ రక్తి
నెరపువాఁడె వడన్న నరుఁడె యనగ

వీను లలరంగ విని విని వేడ్కగదుర
నరుని నావానిగాఁ గొన్న నాతి నిపుడు
నాకు నాలోన వింతయ్యె నరుని మఱచి
మాయ యతి నొక్కరు గాంచి మరులుకొంట.

* విలుకాఁ డెవడండనియన్నఁ గవ్వడియనంగ - అని పాఠాంతరం.

"జగదేక వీరునకు నే
నగుమను దగు వీరపత్నినని తలఁచి మదిం
దగిలి విలువిద్య నేర్చితి
నగవు గదా తపసి కప్పనము సేఁత కడున్."

"ఘోనోల్లను యతి కడ కిఁకఁ
గానిమ్మైన; నరుఁడు గానలలోనన్
గాని యగచాట్లుఁ గుందగ
గానక నేఁ దిరుగుచుంటిఁ గఠిన హృదయనై."

అని కన్నియ దలచుటయును
గనుఁగవ నుప్పొంగి పాఱెఁ గన్నీరు; పరు
గ్గన రాదని పడకింటికిఁ
జని పానుపుఁ జేరి కడు విషాదముఁ జెందెన్.

## మూడవ భాగము

"పంచిరి రాజ బిడ్డ నొక పాంథ తపస్వి సపర్యకై గురుల్
మంచి దలంచి; చేకురక మానునె; నీవిటు వారి పంపుల
జ్జించి పరిత్యజించి నిరసించితి వేముకొ యేమి కీడు శం
కించితివో యటంచు యతి కించల పాల్పడి వేఁగుచుండఁదే.

"తెత్తును నరునని యతి వా
గ్దత్తము గృష్ణునకుఁ జేసె గాన వినుము నీ
తత్తరము మాని జనుమ యు
దాత్తుం డెంతేనిఁ దపసి తప్పునె పలుకుల్.

